# ఆంధ్ర విజయము

( విజయనగర చరిత్ర )

ooooooo

గ్రంథకర్త :

వారణాసి వేంకటేశ్వరులు



పబ్లిషర్సు :

వేంకట్రామ అండ్ కో.,

విజయవాడ — మద్రాసు.

1951

కాపీరైటు]

వెల రు 1-0-0

# విజ్ఞప్తి



నేఁటి జాతీయ విద్యావిధానమునందు విద్యార్థిలోకమునకుఁ దమ పూర్వుల పరిపాలనాపద్ధతులు, లలితకళా పోషణము మున్నగునవి తెలిసికొను టావశ్యకము. అట్టియెడ నాంధ్ర విద్యార్థులకు సైతము వారి తొల్లిటి సామ్రాజ్యాధిపతుల చరిత్ర గ్రహించు టెంతయు ముఖ్యము. ఆ యుద్దేశమున విజయనగర సామ్రాజ్య చరిత్రమును గథావస్తువుగఁ గైకొని 'ఆంధ్రవిజయము' అనుపేర నీ పొత్తమును రచించితిని. చరిత్రాంశమునకే మాత్రము వ్యతిరేకించని విధమున నచ్చటచ్చట నూతన విషయములఁగల్పించిన కొన్ని ప్రకరణము లిందుఁ జేర్చితిని.

ఇయ్యది ఉన్నతపాఠశాలలయందుఁ జదువు హయ్యరు ఫారముల విద్యార్థుల కుపవాచకముగ నుండునట్లు వ్రాసితిని. టెక్స్టుబుక్ కమిటీవారు దీనిని బఠనీయగ్రంథముగ నిర్ణయించెదరని నా విజ్ఞప్తి. ఆంధ్రోపాధ్యాయు లీపుస్తకము నాదరింతురని విశ్వసింతును.

ఈ గ్రంథరచనమున జీర్ణవిజయనగర చరిత్రము, హిందూదేశ కథాసంగ్రహము లోనగు గ్రంథము లాధారపడినవి. ఆయా గ్రంథకర్తలకుఁ గృతజ్ఞతా నమస్కృతులు.

— గ్రంథకర్త.



అదియొకనాఁటి తెల్లవాఱుజాము. ఇంకను గప్పురకప్పురచీఁకటి నలు కెలంకులను గప్పియున్నది. ఆ సమయమునఁ దుంగభద్రా నదీతీరప్రాంత కాంతారమున గొప్ప కల్లోలము పెల్లుబికెను. ఉషోదయముఁ గాంచనిదే తమతమ నివాసముల వీడని శకుంత సంతానములు మిక్కిలి రొదసేయుచుఁ బైన సంచరింపుచుండెను. అటవీమృగముల భయంకరారావములు దిక్కులఁ బిక్కటిల్లుచుండెను. ఆ భీషణఘోషణములకు భీతిల్లి సాధుజంతువులు దిక్కుఁ దెలియక బఱచుచుఁ జెల్లాచెదరగుచుండెను.

అట్టిసంచలమునకుఁ గారణము లేకపోలేదు. కొందఱు సైనికులు బల్లెములు, నీఁటెలు లోనగు నాయుధముల ధరించి వారి నాయకులు వెంబడింప వేఁటకై బయలుదేఱిరి. వేఁటకుక్కలు వారివెంటఁ జనుచుండెను. ఆ వీరభటులలోఁ గొందఱు తమలోఁదాము హెచ్చరికలు సలుపుకొనుచుఁ బరాకు లేక బిఱానఁ బరుగిడుచుఁ బాఱివచ్చు పలురకముల నడవిజంతువులఁ జంపుచుండిరి. సింహ శార్దూలాది క్రూరమృగములనేరి వధించు తమకమున మఱికొందఱు తిరుగుచుండిరి. వారి నాయకులు సైతము మత్తగజములపై నెక్కి యుక్కుతునకల వంటి శూరవరులు చుట్టుముట్టియుండ వేటలాఁడు చుండిరి. ఆ యాఖేటమునందు నానావిధ వన్యమృగములెన్నియో వధింపఁ బడుచుండెను.

తుంగభద్రా నదీతీరమునఁగల యటవికి గూఁతవేటుదూర మున నొక పల్లెగూడెముఁ గలదు. అప్పటికిఁ దూరుపు తెల్ల వాఱఁజొచ్చెను. అడవి జంతువుల పెనురొదల కదరిపడుచు నా పల్లెప్రజ లెల్లరు మేల్కొనిరి. అట్టి బెట్టిదమైన కలగుండునకుఁ గడుంగడు కంపమొందసాగిరి. ఆ గూడెమునం దొక పూరి గుడిసెనుండి యిద్దఱువ్యక్తులు బయటికివచ్చి యిట్లు మాటలాడ మొదలిడిరి.

"అబ్బబ్బ! ఈ గోల యేమిటి? చెవులు చిల్లులు పడిపోవు చున్నవి!"

"ఏమిచెప్పను! ఏదో రాజులగోలయే! లేకున్న నింతటి కలంత సెలంగునా?"

"రాజులగోల యేమిటి?"

"ఏమున్నది! చల్లఁగాఁదిని కూర్చుండలేక రాజు లొండొ రులపై దండెత్తుచుందురు. ఆ సందడికిఁ దాళజాల కడవులు దద్దరిల్లిపోవుచుండును."

"ఇది యా సందడియే యందువా?"

"అదియే కావచ్చునని నాయూహ...ఆఁ! మఱచితి. అది కాకున్న మఱొక్కగోలకద్దు."

"ఏమిటది?"

"వేఁట. చీటికి మాటికి రాజుల వేఁటలాటల మూలమున నెన్నియో యిక్కట్టులు కలుగుచుండును."

"ఇది యట్టిచేటేనా?"

"కాఁకేమిటి? ముమ్మాటి కదియే యైయుండును."

"రాజులకీ వేఁటయందింతటిమక్కువ యేటికోకాని యెన్ని నోరులేనిజంతువులో గుట్టలుగుట్టలుగా చనిపోవుచున్నవి.

"అవునవును. వారియుబలాటకై పెద్దమెకములతోఁబాటు నోరువాయిలేని చిన్నజంతువులు గూడఁ జనిపోవుచున్నవికదా!"

"అంతియకాక మనబోటి యాటవికుల కిదియొక చేటుగా నున్నది."

"ఎప్పుడో యడవిమెకముల బెడఁద బడలేక జనులు రాజు దగ్గఱకేగి మనవిచేసికొనుట - అదివిని రాజులు వేఁటకేగి యడవి మృగములబాధ నడఁచుటఁబాడికాని, మాటిమాటికిట్లు లడవు లపైఁబడుటెట్టిమాట?"

"పిల్లికిఁజెలగాట యెలుకకుఁ బ్రాణసంకట మనినట్లు మధ్య మనకు దాపురించిన దీ పీడ!"

"నిజమే! అదేదో బయటికేగి చూచివచ్చెదను."

వారట్లు మాటలాడుకొనుచు గుడిసె ముందటిభాగమునకు వచ్చిరి. అచ్చటఁ గట్టివైచిన వారి లేడిజంట లేకుండెను. ప్రాణసమానముగఁ బెంచుకొనిన మృగములు కానరానందులకుఁ గడుంగడు నా యాటవిక దంపతులు భయమందిరి. క్రూర మృగముల భయదనినదముల కదరి కట్టుత్రాళ్ళఁ ద్రెంపు కొని పాఱిపోయియుండునని తలఁచి వానినెమకుటకై వారిరు వురు బయలుదేఱిరి. ఆ చుట్టుప్రక్కలఁ గొన్నిచోటుల వెదకి

వారి మృగములజాడ గాంచిరైరి. మఱికొంతదూర మేగునర కొక యమ్మ గ్రుచ్చికొని చచ్చిపడియున్న లేడినిఁగాంచి, యది వారిదేయని గుర్తించి మిక్కిలి దుఃఖించిరి.

"అన్నన్న! అన్నెము పున్నెమెఱుఁగని నా చిన్నిలేడినిఁ జంపుటకు వారికిఁ జేతులెట్లువచ్చినవి?"

"రాతిగుండెలు గలవారికి లేడి యొకలెక్కయేమిటి? పిల్లిని సైతముఁ బొట్టనఁ బెట్టుకొందురు."

"పచ్చిగడ్డిఁదిని, పడియనీరు ద్రాగి, యమ్మతల్లివలెఁ జెంగు చెంగున దూకుచు నా కొంగుబట్టుకొని తిరుగాడు ముద్దుల లేడిని వీడి నేనెట్లులుండఁగలను?"

"ఊరుకొనుము. ఏడువబోకుము."

"నాకీ వలవంత యెంతకాలమునకైనను బోదు."

"పోక మనమేమిచేయఁగలము. వడ్లతో నెండెడి తట్టవలె మన మీ రాజులవారికి గుటికావలసినదే!"

కొంతసేపు వారట్టులఁ జింతించి చింతించి చేయునదేమియు లేకఁ దుద కా మృగకళేబరమును దమ గుడిసెకడకుఁ గొని పోయిరి. వెంటనే రెండవ లేడిజాడ నరయుటకై యాతఁడు బయలుదేఱి తుంగభద్రానదీ తటమున కేగెను.

క్రీస్తుశకము పదునాల్గవ శతాబ్దారంభమున దక్షిణ దేశము నందలి స్థితిగతు లన్నియుఁ దాఱుమాఱుగ నుండెను. ఆ కాలమున నార్యావర్తమునఁ జాలభాగము మహమ్మదీయుల పరిపాలనకు లోఁబడియుండెను. దక్షిణాపథమున మాత్రము దేవగిరిని రాజధానిగఁ జేసికొని హరిపాలదేవుఁడును, ఓరుగల్లు ముఖ్యపట్టణముఁగావించుకొని ప్రతాపరుద్రదేవ చక్రవర్తియు బాలించుచుండిరి. వారలేకాక గజపతులు, రెడ్డిరాజులు మున్నగు వారు చిన్నచిన్నరాజ్యము లేర్పఱచుకొని యేలుచుండిరి. ఆ రాజేంద్రులు తమ శౌర్యసాహసాదులచేఁ తఱచుగ దండెత్తి వచ్చు చంద్రధ్వజుల దండయాత్రల నెదుర్కొనుచు వారల నోడించుచుండిరి. అట్లు కొంతకాలమువఱకుఁ బ్రతాపరుద్ర దేవాదులు యవనుల విజృంభణమునాపి, యాంధ్రసామ్రాజ్య ప్రాభవమును నిలువఁబెట్టిరి.

తరువాతఁ గాలక్రమమున దేవగిరి, యోరుగల్లు రాజ్యములు తురుష్కుల ధాటి కాగఁజాలక వారి వశమైపోయెను. ఆంధ్రసామ్రాజ్యము క్షీణించిపోయిన పదఁపడి ప్రతాపరుద్రుని కోశాగార రక్షకులగు హరిహరరాయలు, బుక్కరాయలు ననువారలు శ్రమించి యా సమయమునఁ దుంగభద్రానదికి ఉత్తరభాగమున నానెగొంది రాజధానిగఁ జేసికొని పాలించు జంబుకేశ్వరరాయల నాశ్రయించి, యచ్చటఁ జేరిరి. వారల ప్రతిభను, బరాక్రమము నీవఱకే వినియున్న జంబుకేశ్వర

రాయ లా సోదరద్వయము నాదరించి, యొకనిని మంత్రిగను, మఱియొకనిని గోశాధిపతిగను నియమించుకొనెను. క్రమముగ నా సోదరులిరువురు ప్రభుభక్తి పరాయణులై రాజ్యతంత్రములఁ జక్కఁగా నడపుచు తేని యభిమానమునుబొంది, ప్రజల ప్రేమ కుఁ బాత్రులగుచు నుండిరి.

అదియట్లుండ ఢిల్లీపాదుషాచే దక్షిణాపథమునకు రాజప్రతి నిధిగఁ బంపఁబడిన 'బహాద్దీన్' అనునతఁడు స్వతంత్రించి చక్ర వర్తి శాసనముల ధిక్కరింపుచు రాజ్యాకాంక్షాలోలుఁడై యుండెను. ఢిల్లీశ్వరుఁ డా సమాచారముఁ దెలిసికొని, వాని ధిక్కారమణంప నొక సమర్థుఁడగు సేనాపతికిఁ గొంత సైన్య మొసఁగి "చమూపతీ ! బాహాద్దీన్ దురాశాపరుఁడై మా యాజ్ఞలనే ధిక్కరించుచున్నాఁడు. ఆతనికి మేమొసఁగిన యాద రాభిమానముల దుర్వినియోగముఁ జేసికొని 'తిన్నయింటి వాసముల లెక్కబెట్టినట్లు' మాపైననే కత్తిగట్టుటకు సాహసించి నాఁడు. అతిక్రాంత ధర్ములకుఁ దగిన మర్యాదయే సలుప వలయునుకాని వేఱొండువిధము పనికిరాదు. కావున వేగముగ నీవేగి నీ పరాక్రమాదుల ప్రదర్శించి వానినోడించి సజీవముగ మా కడకుఁ గొనిరాగలవని విశ్వసింతుము. ఈ విషయమున నీవు సఫలీకృత మనోరథుఁడవగుచో మా ప్రేమకుఁ బాత్రుఁడవగు టయేకాక వెలగల బహుమతులఁగూడ నొందగల"వనిచెప్పెను. ఆ దండనాయకుఁడు పాదుషా యనుమతి శిరసావహించి సైన్య మును గైకొని చనెను.

అట్లాతఁడు ససైన్యుఁడై పయనించి బాహాద్దీనుపై యుద్ధ మునకుఁ దలఁపడెను. ఆ సేనానితో బాహాద్దీన్ కొంతతడవు

పోరి గెలువఁజాలక తుదకు పాఱిపోయి జంబుకేశ్వరరాయల శరణుజొచ్చెను. శరణాగత బిరుదాంకితుఁడగు నా రాజచంద్రుఁ డాతని కాశ్రయమిచ్చెను. తురుష్కదండనాయకుఁడు బాహుదీన్ పాఱిపోయి జంబుకేశ్వరరాయల శరణుజొచ్చిన సంగతి తెలిసికొని యా రాజుతోఁ బోరి జయింపలేక ఢిల్లీకేగి యావద్వృత్తాంతమును బాదుషా కెఱింగించెను.

అది విని ఢిల్లీచక్రవర్తి యగ్గిపై గుగ్గిలమువలె మండిపడి లెక్కకు మిక్కిలియగు నుక్కుమీఱిన బలములతో బయలుదేఱి యానెగొందిపైఁబడెను. జంబుకేశ్వరుఁడు దనసైన్యములఁ బ్రోగు చేసికొని సాహసమునఁ బాదుషానెదిరించెను. అంతవారిరువురకు ఘోరమైన రణముజరిగెను. తురుష్కసైనికు లధికముగనుండు టచే నెట్లయినఁ దన కపజయముఁ దప్పదని తలఁచి జంబుకేశ్వర రాయలు స్త్రీలకుఁ జితులేర్పఱచి, కృపాణధారియై రణరంగమున కురికి పలువురు పగతుఱఁ బరిమార్చి వీరమరణమందెను. అంత నాతని హతశేష సైనికులు తెగిన హారములోని ముత్యములట్లు వెఱచి పఱచిరి. ఆనెగొంద యవనుల వశమయ్యెను. హరిహర బుక్కరాయాదులు పాదుషాకు బందీలైరి. అట్లు విజయగర్వోన్మత్తుఁడై ఢిల్లీశుఁడు 'మల్లిక్‌సాయబ్' అను నాతని యానెగొందికిఁ బ్రతినిధిగ నిలిపి, బందీలగైకొని ఢిల్లీకేగెను.

తరువాత మల్లిక్‌సాయబ్ ఆనెగొందికిఁ బరిపాలకుఁడై యుండెను. అతఁ డధికారగర్వమునఁ గన్నుమిన్ను గానక రాజ్యపాలనము సక్రమముగఁ జేయకుండెను. తన యిచ్చవచ్చిన చట్టములఁ బ్రవేశపెట్టి నిరంకుశముగ వర్తింపఁ దొడఁగెను. అట్టి

కంటకప్రాయమగు నేలుబడికిఁ బ్రజలోర్వలేకపోవుచుండిరి. నానాఁటి కాతని పాలనమున నానాబాధలకు గురియగుచుండిరి. రాజ్యము నందంతటను శాంతిభద్రతలు తరిగిపోవుచుండెను. పరుల దొరతనమునకుఁ బాల్పడిన ప్రజానీకము పలురకములగు బాములపాలఁ బడుచుండును గదా!

ఆనెగొంది ప్రజలలో నోరిమి తరిగిపోయిన కొలఁది ప్రభుత్వమునం దసూయ జనించెను. నయమార్గమున దురుష్కనాయకునకుఁ దమ కష్టములఁ గూర్చి విజ్ఞప్తి సేయుటకుఁ బ్రజానీకము నిశ్చయించుకొనెను. ఒకనాఁడు వారిలోఁ గొందఱు నాయకు లేకమై మహమ్మదీయ ప్రతినిధి కడ కేగి "అయ్యా! మీ పరిపాలనమునందు మాకు శాంతిసౌఖ్యములు కలుగుట లేదు. అంతియేకాక మా యాచారవ్యవహారములకు నిరోధముఁ గలుగుచున్నది. క్రమమగు పరిపాలనాపద్ధతులు లేనందున సామాన్య ప్రజానీకము పెక్కుచిక్కులకు లోనగుచున్నది. పరప్రభుత్వమని మాకు రోఁత జనింపకుండునటుల జూడుఁడు. దయార్ద్ర హృదయులగు మహమ్మదీయప్రభువులలోఁ గొందఱు సకల ప్రజాభీష్టానుసారముగాఁ జక్కని పరిపాలనము సాగించి యుండలేదా? మీరు నటులయొనరించి యశము నొందుఁడు. మామనవి యాలకించి సకల మతములకును సమ్మతమగునట్లు రాజ్యపాలనముఁ గావించి ప్రజానురంజకుఁడను బిరుదువహింపు" డని పలుతెలుంగుల మనవి యొనరించుకొనిరి. కాని చవిటినేల గురిసిన వర్షమువలె నా మాటలా మహమ్మదీయ ప్రతినిధియెడల నిరర్థకమయ్యెను.

తమ నాయకుల రాయబారము నిష్ప్రయోజనమైనందులకు జనులెల్లరు నిరాశవహించిరి. రాజ్యమునం దంతట నలజడి మెండయ్యెను. దుండగులు విచ్చలవిడి విహరింపఁ జొచ్చిరి. రాజకీయోద్యోగులలో స్వార్థపరత్వము హెచ్చెను. ప్రజలలో నశాంతి చెలరేగెను. ఇంకఁ బారతంత్ర్యమున నుండజాలకఁ బ్రజలెల్ల రొక్కుమ్మడి మల్లిక్‌సాహెబుపైఁ దిరుగబడిరి. వారి యందుఁగల పట్టుదలయు, స్వతంత్రతా వాంఛయుఁ బెచ్చు మీఱినవి. తురుష్క-పాలనమునకు స్వస్తి చెప్పు సమయమాసన్నమైనదని శౌర్యమునఁ జెలరేగిరి. అట్టి స్థితినిఁ గాంచి మల్లిక్ సాయబ్ వారి తిరుగుబాటు నడంపలేక, యిఁక నచ్చట రాజ్య భారమువహించుట దుర్లభమని నిశ్చయించిపలాయనమంత్రముఁ బఠించి ఢిల్లీకిఁ జేరెను.

ఆతని దైన్యస్థితియు, నసమర్థతను, దుష్ట పరిపాలనమును సమగ్రముగా నాలించి ఢిల్లీపాదుషా కొంతతడవు యోచించి వేఱువెర వేమియులేక కారాగారమునందుంచిన హరిహర బుక్క-రాయ సోదరులఁ దన సముఖమునకు రప్పించెను. అంత నాతఁడు వారినిఁ జూచి "మా ప్రతినిధి యానెగొందియందు దొరతనము నిర్వహింపలే కిట కరుదెంచినాఁడు. అచ్చటి జను లందఱు మీ యందధికానురాగముఁ గలిగి యున్నవారఁట. అట్టి ప్రజాభీష్టమును మన్నించి మీ సోదరుల కానెగొంది రాజ్య మొసఁగుచున్నారము. నేటినుండియు మీరు మాతో స్నేహముఁ బాటించి మాకు సామంతులుగ నుండఁగోరుచున్నామ"ని పలికెను. అంత వారలు పులికోరలనుండి విడువఁబడిన వారివలెఁ బొంగిపడుచుఁ దమయందు దయఁ

జూపిన పరమేశ్వరునకు లోలోనఁ బ్రణామము లొనరించు కొనుచుఁ బాదుషాపలుకులకు సమ్మతించిరి. అంతటఁ దురుష్క-చక్రవర్తి వారల నుచితరీతిని బహువిధ బహూకృతులతో గౌరవించి పరివారసహితముగ నానెగొందికిఁ బంపెను.

తమ మంత్రిశేఖరు లేతెంచుచున్నారను వార్త తెలియఁగనే యానెగొంది ప్రజ లానందపరవశులై యెదురేగి హరిహరబుక్క-రాయల నత్యంత భక్తిగౌరవములతోఁ గొనివచ్చిరి. ప్రజలు తమయందుఁ బ్రకటించిన యభిమానమునకు హరిహరరాయలు సంతసించి వారికెల్లర కభయమొసఁగెను. ఒక సుముహూర్తమున నాతఁ డానెగొంది రాజ్యసింహాసన మధిష్ఠించి, తన తమ్ముని యువరాజును గావించుకొని చక్కఁగా రాజ్యమేలుచుండెను.

ఏ సుందరపురము విజయనగరసామ్రాజ్య రమారమణీ కాల వాల మయ్యెనో, యేపట్టణాధీశు లేకచ్ఛత్రాధిపత్యమున దక్షిణాపథమునెల్లను బాలించిరో, యే నగరరాజ్యము రెండువందల యేబదియేడులకాలముఁ దురుష్కవాహిని నడ్డగించి వారి ప్రక్కలోని బల్లెమైయుండెనో, యే పురీవరము సకలకళా శోభితుఁడగు నాంధ్రభోజుని పాలన భాగ్యమందియుండెనో, యేమహాపత్తనము పరదేశ రాయబారులచే సైతముఁ బశ్చిమదేశ రాజధానీనగరము లేవియు దీనిప్రాభవమునకు "సాటిరా"వని ప్రశంసింపఁబడెనో, యట్టి విజయనగరమును నిర్మాణముగావించిన హరిహరరాయలు, విజయనగర మహాసామ్రాజ్యమునకుఁ దొలుదొల్త ఆనెగొందిలోఁ బునాది వైచెను.

హరిహరరాయలట్లు సర్వజనానురంజకముగ నానాటికి రాజ్యమేలుచుఁ గ్రమక్రమమున నా రాజ్యమును వృద్ధిపఱుపఁ గడంగెను. వీరాగ్రణులగు చాలమంది సైనికుల గూర్చికొనెను. దుర్గము నన్నివిధముల బాగుచేయించెను. సహజముగ స్వతంత్ర వాంఛాపరుఁడగు హరిహరరాయలింక ఢిల్లీ పాదుషాకు సామంతుఁడుగ నుండలేకపోయెను. దుస్సహమగు నస్వతంత్రము దూరముఁ జేయదలంచెను. స్వీయదేశాభిమానము పెంపున నాతఁడొకనాఁడు ఢిల్లీశ్వరునకుఁ 'దానింక సామంత రాజుగ నుండఁజాల' నని వార్తనంపి స్వాతంత్ర్యముఁ బ్రకటించెను. అప్పుడు ఢిల్లీపాదుషా రాజకీయములగు చిక్కులలో దవ్వులొక్కని యుండుటచే దానికేమియు సమాధానముఁ బంపక మిన్నకుండెను.

పిమ్మట హరిహరరాయలు తమ్మునితోడను, శూర కులాగ్రేసరులగు దండనాథులతోడను దండయాత్రలు సల్పి మహమ్మదీయుల పాలనకు లోనై యున్న ఓరుగల్లు, దేవగిరి మొదలగు దుర్గము లాక్రమించెను. అటుతరువాత దక్షిణ దిగ్భాగమునకెరిగి కన్నడరాజ్యమును జయించెను. ఇట్లాతఁడు జైత్రయాత్రల సలిపి విజయనగర సామ్రాజ్యమును విశాలముఁ గావించెను. అప్పటనుండియు దక్షిణదేశమంతయుఁ జంద్రధ్వజుల పాలనముఁ బొసి హాయిగ నుండెను.

చరిత్రాంశములును, శాసనాధారములనుబట్టి చూడ హరిహరరాయలునకు నల్వురు తమ్ములుండిరనియు, విజయనగర

సామ్రాజ్యమున వారలొక్కొక భాగమున కేలికలై యుండి రనియు, వారు సంగముఁడనువాని కుమారులనియుఁ, బంచ పాండవులవలె వారత్యంత పరాక్రమవంతులై, యన్యోన్యప్రేమ గలిగి యుండిరనియుఁ దెలియవచ్చుచున్నది. నిజా నిజములెట్లున్నను హరిహరబుక్కరాయ లిరువురే మిక్కిలి చరిత్ర ప్రఖ్యాతి నందియుండిరి. వీరికడ బల్లప్పయను గొప్ప దండనాయకుఁ డుండెను. అతఁడు హరిహరరాయ సోదరకీర్తైన వీరవరేణ్యుఁ డని పేరుపొందెను.

తమ్ములసాయముతోడను, దండనాథుల శౌర్యోత్సాహములవలనను హరిహరరాయ లనంతవైభవమున రాజ్యపాలన సేయుచుండెను. అట్లుండ నొకనాఁడాతఁ డాఖేటవినోదమునం దభిలాషకలవాఁడై సపరివారముగఁ దుంగభద్రాతీర ప్రాంతమునఁగల యరణ్యములకేగెను. ఆ సైనిక సంరంభము వలననే క్రిందటి ప్రకరణమునఁ జెప్పబఁడిన సంచలనము సంభవించెను.

# ౩

అది సూర్యోదయ సమయము. అట్టియెడ నమృత తేజోమయుఁడును, సకలచరాచర సంరక్షణాశీలుఁడును, నిఖిల జీవసంతతులకుఁ గాంతి నొసఁగువాఁడునునగు సూర్యభగవానుఁ డుదయించెను. ఆతని తరణి కిరణజాలపు టరుణకాంతి చివురుటాకులపైఁ బ్రసరించి వెండిరేకులవలెఁ గనుపింపఁజేయుచుండెను. తుంపెసలాడు చెట్లయాకులపైఁ గల తుషారపుం దుంపరలు లేయెండ సోకి ముత్యములరీతి మెరయుచుండెను. తుంగభద్రా నదీతరంగములపై బాలభానుని భానుసముదయము వ్యాపించి బహుభంగులఁ బ్రకాశింపు చుండెను. ఆతటినీతటమున నవవికసితములైన లతాంతములపై నలినీబాంధవురశ్మి తవిలి వానిని మఱింత శోభావంతము సేయుచుండెను. తత్ప్రాంత వృక్షములపైనున్న పక్షిగణము భయమునుబాసి మనోహరధ్వను లొనరించుచుండెను.

ఆ సమయమున హరిహర బుక్కరాయసోదరులు తుంగభద్రయొడ్డునకువచ్చిరి. ఆ నదీజలములఁగొని ముఖప్రక్షాళనము గావించుకొని మెత్తని పచ్చిగడ్డిపైఁ గూరుచుండిరి. వారి జాగిలములు వారివెంటవచ్చి, యచ్చోటఁబరుండియున్నవి.

'తమ్ముఁడా! ఉషోదయమునకుఁ బూర్వమునుండియు మృగయోత్సవమునెరపి మిక్కిలి బడలితిమి. సైనికులకుఁగూడ నాఖేట మాపుమని చెప్పితివిగదా!'

'చెప్పితిని. వేఁటతమకమునఁ గలిగిన శ్రమమును బాపు కొనుట కిందుఁ గొంతతడవు విశ్రమింతము.'

'ఆహా! ఈ ప్రభాతశీతవాతము మేనికి హాయినొసంగు చున్నది. అగ్రజా! సమీరకుమారుఁడు మనకు దగ్గఱచుట్టమో యన్నట్లు మనోహర పుష్పసౌరభములఁ గొనివచ్చి మనకం దిచ్చుచున్నాఁడు'

'నిజము. నిజము ప్రభాత సమయమెంతయుఁ బ్రశాంత మైనది. (పరికించి) సోదరా! అటుచూడుము'

'ఏమది ?'

'ఏటియొడ్డున మనవేఁటకుక్కలు తిరుగాడుచుండ కుందేళ్ళు వానినెదురించుచున్నవి. అందులకుఁగొంకి జాగిలములు వెను దిరిగి పరుగిడుచున్నవి.'

'ఔరా! ఇదియేమిచిత్రమన్నా! ఇది యపూర్వవిషయమే!'

'నాకేమియుఁ దోఁచుటలేదు. ఇందేదో మహిమ మున్నది!'

'అదిగో! ఆ దేవాలయమునం దొక యతీశ్వరుఁడున్నట్లు న్నాఁడు, వాని నారయుదమా?'

'మంచిది.'

వారట్లు మాటలాడుకొని మాటామాటినేగి దేవాలయ ప్రాంగణమునఁ గూర్చుండియున్న ఋషీశ్వరున కెఱఁగిరి. ఆ సంయమీశ్వరుఁడు వారినాశీర్వదించి, రాజలాంఛనములతో నున్న సోదరుల గౌరవించి కూర్చుండ నియమించెను. అప్పుడు వారికిట్లు సంభాషణ జరిగెను.

'మునీంద్రచంద్రమా ! తా మెవ్వరో సెలవీయుఁడు?'

'విద్యారణ్యుఁడందురు.'

'ఓహో ! ధన్యులము. తలవని తలంపుగఁ దమ దర్శన భాగ్యము లభించినందులకు మిక్కిలి యానందము కలిగినది.'

'హరిహరరాయా! మీ సోదరులకు శుభమగుఁగాత!'

'మహాత్మా! తమధ్యానదీక్షకు భంగముఁ గలిగించినందులకు మమ్ము క్షమింపుఁడు.'

'భంగమేమియు లేదు. మీరు వచ్చినపనిఁ దెల్పుఁడు.'

'ఇంతవఱకుఁ గనివినియెఱుంగని యొక వింతవిషయము దమకు నివేదింప వచ్చితిమి.'

'ఎట్టిదా వింత ?'

"నేఁడు సైన్యసమేతులమై తుంగభద్రా ప్రవంతినీప్రాంత కాంతారభూమికి మృగవ్యకాంక్షతో నేతెంచితిమి."

"అందు వింతయేమి?"

"ఏమిచెప్పుదుము యతివంతసమా! తుంగభద్రకు దక్షిణపు టొడ్డున కేగితిమి. వేఁట కుక్కలు వెనుకంజ వేయగడంగినవి."

"తగిన హేతువుండక ట్లు జరుగదుకదా!"

"చిత్తముస్వామీ ! ఆ ప్రాంతమున కేగుసరికి కుందేళ్ళు చెలరేగికవిసి వేఁటకుక్కలను దరుమసాగినవి. వాని శౌర్యమునకు జంకి వేఁటకుక్కలు వెనుకకు బరుగిడినవి. ఇది యసాధారణ విషయముకదా!"

(కొంతతడవు యోజించి) "రాజా! ఇందేమియు వింతలేదు."

'అదెట్లు స్వామీ?'

'ప్రకృతిలోఁ గొన్ని ప్రదేశములు సహజ శౌర్యవంతములై రాజిల్లుచుండును. అట్టివానిలో నిదియొకటి.'

'దీనికి స్థలమాహాత్మ్య మేమైనఁగలదా?'

'లేకేమి! జాగిలముల భయమందఁజేసిన కుందేటిపోటరి తనమునకుఁ గారణమేమని తలంచితివి? ఇదియొక విస్తార శౌర్య ప్రదమగునెలవు. ఈ ప్రదేశమున నపజయమునకుఁ దావులేదు. దీనినిఁగూర్చి నాకొక యభిమతము కలదు.'

'సెలవిండు.'

'ఇచ్చట నొక నగరమును నిర్మింపుము. ఆనెగొందిఁ బదులు దీనినే రాజధానీనగరము కావించుకొనుము. విజయశ్రీల వెలయించి నిరంతర దిగ్విజయముల ఘటింపజేఁసి, ప్రపంచ ప్రఖ్యాతి నందఁగల పట్టణరాజమై విజయనగరమను పేర నీ పురి వెలుఁగొందఁగలదు.'

'విద్యారణ్యస్వామీ! తమ దూరదృష్టి యమోఘమైనది. తమ యాశీర్వాద బలమున నగర నిర్మాణముఁ గావింతును. తొలుత నది తమ పేరిట విద్యానగరమై విలసిల్లవలెను.'

'భూపాలా! నీ యభిమతమే కానిమ్ము.'

'మహాత్మా! నగరు నిర్మితికి సుముహూర్త మెప్పుడు నిశ్చయించెదరు.'

'దైవాజ్ఞ దాటరానిది. ఫలాసన్న మొకని ప్రేరణము లేకయే సమకూరుచుండును. నీవట్టుల విధినియమానుసరణి నేతెంచితివి. ఇదియ దివ్యమైన లగ్నము. వేళసమీపించినది కానిమ్ము.'

'మహానుభావా! ఈ దివ్యసుముహూర్తమున విధివిధానముగఁ దమరే విద్యానగర నిర్మాణమునకుఁ బునాది నిడుఁడు అట్టులే యగుగాక!

విద్యారణ్యస్వామి యాశుభముహూర్తమున వేదవిధానమున నగరప్రతిష్ఠఁగావించెను. అందులకుఁ దగిన మంగళవాద్యములో యనినట్లు శుభసూచకముగఁ బలురకములగుపక్షులు కిలకిలాలాపము లొనరించెను. ఆ సోదరులా సంఘటనమున కానందకందళితహృదయులైరి. అంత హరిహరరాయలు విద్యారణ్యులనుగాంచి 'సంయమీంద్రా! నాదొక్క విన్నపము కల' దనెను.

'వచింపుము.'

తమ రద్వితీయ రాజకీయ ధురంధరులనియుఁ గారణాంతరమున సన్యసించితిరనియు వింటిమి. తమరు మాకు విద్యాగురువులై, విశేషించి యమాత్యశేఖరులైయుండి రాజ్యతంత్రము నడపుచుందురని ప్రార్థించెదను.'

'హరిహరరాయా! నీ యభీష్టమున కంగీకరించితిని. ఇంక నగర నిర్మాణమునకుఁ బూనుకొనుము.'

"మహాభాగ్యము"

అంతట వారందఱును ఆనెగొందికిఁ జనిరి.

దేశభక్తులు పెక్కురీతులుగ నుందురు. కొందరనల్పశిల్పనౌ కల్పనములగు జాతీయకావ్యముల సృజించి దేశోద్ధారకారకు లగుచున్నారు. కొందఱు సమస్త ప్రజానురంజకముగ రాజ్యమును బాలించి చిరస్మరణీయులగుచున్నారు. ఇంకఁ గొందఱు విశేషబుద్ధిబలముచే మంత్రాంగమును నడపి స్వదేశమును శత్రువులబారినుండి సంరక్షింపజేసి చరిత్రప్రఖ్యాతినందఁగల్గుచున్నారు. వేఱొక కొందఱు తమ ధనప్రాణాదిసర్వస్వమును మాతృదేశమునకై వినియోగించి మిపులఁ జరితార్థులగుచున్నారు.

అట్టివారిలో విద్యారణ్యస్వామి యొక్కరుఁడు. అతఁడు తన ధీచాతుర్యమున విజయనగర సామ్రాజ్య ప్రతిష్ఠాపనాచార్యుఁడై యనుపమేయ వైదిక లౌకికవ్యవహార దక్షుఁడై, స్వదేశ భక్తాగ్రగణ్యుఁడై, ప్రజోపయోగకరములగు పెక్కు రాజకీయ గ్రంథములను, ధర్మశాస్త్రములను రచించి విశ్వవిఖ్యాతిగాంచినాఁడు.

సన్యసించుటకుఁ బూర్వ మీతని నామము మాధవాచార్యుఁడు. వేదపండితుడై యుండుటవలన నాయన కాచార్య నామముసార్థకమై యుండనోపు. ఈయన భారద్వాజగోత్ర సంజనితుఁడు.సాయన కులజుఁడు. తలిదండ్రులు శ్రీమతి మాయణులు. ఈయన బాల్యమునుండియు వేదశాస్త్రాదుల నభ్యసించి యుక్తవయస్సు వచ్చునప్పటికే యద్వితీయ పండితశ్రేష్ఠుఁ డయ్యె

నట. తరువాతఁ దన పాండితీపటిమవలన వేదాంతము, వైద్యము, జ్యోతిషము, వ్యాకరణము, చరిత్రము మున్నగు విషయములపై నీయన పెక్కు గ్రంథములు రచించెను. ఈయన రచించిన వేద భాష్యము సాయణభాష్యమనుపేరఁ బరగుచుండెను. ఇట్టు లీ మహనీయుఁడు వాఙ్మయమున కపారసేవఁగావించి, యసమాన మగు యశము, గౌరవము, నందెను. నేటికి నీ పండితప్రవరుని గ్రంథరాజములు విద్వన్మాన్యములై వెలయుచున్నవి.

తరువాతఁ గొంతకాలమునకు మాధవాచార్యుఁడు జీవ న్ముక్తిదాయకమగు సన్యాసము స్వీకరించెను. సన్యసించిన పిదప నీయన విద్యారణ్యస్వామి యని పిలువఁబడుచుండెను. ఒకనాఁడీ సాధుపుంగవుఁడు తుంగభద్రాతీరమునఁగల దేవళమున దైవధ్యా నముఁ గావించుకొనుచుండ హరిహర బుక్కరాయ లేతెంచు టయు, వారు వింతవిషయము విన్నవించుటయు, విద్యానగర నిర్మాణయత్నమును వెనుకటి ప్రకరణమునఁ జదివియుంటిరి.

ఆ కాలమున మహమ్మదీయ విజృంభణము వలన దేశ మరాజ కముగ నుండి పెక్కుడుములకు లోనైయుండెను. శాంతిభద్రతలు సన్నగిల్లిపోయెను. పెక్కురు స్వదేశరాజులు రాజ్యములు స్థాపిం చుటయు, నవి యత్యల్పకాలముననే సమసిపోవుటయు జరిగెను. అట్టియెడ నదృష్టవశమున నానెగొందియందు హరిహరరాయలు రాజ్యము స్థాపించెను. ఈ పరిస్థితులన్నియు సమీక్షించి విద్యా రణ్యస్వామి తాను సన్యసించియున్నను స్వార్థరహితమైన దేశసేవఁ జేయనెంచియుండెను. యవనుల దాడులకు గురియగుచున్న భారతీయుల సంరక్షింపఁ గంకణముఁ దాల్చెను. ఆనెగొంది

రాజ్యమును బలపఱచి, తన్మూలమున దురాక్రమణలు జరుగ కుండునట్లు చేయుటచే విద్యారణ్యుని ప్రధానోద్దేశమై యుండెను.

అట్లుండ హరిహరరాయలు విద్యారణ్యస్వామికడ కేతెంచి 'మంత్రాంగమును నిర్వహింపుఁడనియు, విద్యాపుర నిర్మితికిఁ దోడుపడుఁడనియు' నర్థించెను. ఆతని ప్రార్థన మంగీకరించి నాఁటినుండియు విద్యారణ్యుఁడు మంత్రిగను, విద్యాగురువుగను ఉండెను.

యత్యాశ్రమ స్వీకారమునకు ముందుగనే హరిహరరాయలు నకు మాధవాచార్యుఁడు మంత్రిగనుండి రాజకార్యభారము వహించియుండెనని కొందఱందురు. ఏది ఎట్లయినను మాధవా చార్యుఁడు హరిహరునకు మంత్ర తంత్రాంగ బోధకుఁడుగనుండి విజయనగర మహాసామ్రాజ్య కారకుఁడని పేరుగాంచుట మాత్రము నిర్వివాదాంశము. ఆతని ప్రజ్ఞాచాతుర్యము నేఁటికిని సర్వులచేఁ గొండాడఁ బడుచున్నది.

తుంగభద్రా నదీతీరమున విజయనగర నిర్మాణ కార్యకలా పములు శరవేగమున జరుగు చుండెను. శిల్పకళానిధులగు పెక్కండ్రు పనివాండ్రు నియమింపఁబడిరి. అసమాన ప్రతిభా వంతుఁడైన విద్యారణ్యుని యాలోచన ననుసరించి హరిహర రాయ లతి త్వరితగతిని నగరనిర్మాణముఁ బూర్తికావింపఁ జేసెను.

రామాయణకాలమునఁ జెప్పఁబడిన కిష్కింధయను పట్టణ ప్రదేశమునఁ దుంగభద్ర దక్షిణపు గట్టున నీ పట్టణరాజము కట్టబడినది. శ్రీమద్రామాయణమునందుఁ బేర్కొనఁ బడిన

మతంగ మాల్యవంతాది పర్వతములు విజయనగరమునకుఁ బూర్వ పశ్చిమ దిశలందుండి పెట్టని గొప్ప కోటగోడలవలె నుండెను. దక్షిణమునందుఁ గొన్ని గుట్టలును విశాలమైన తటాకమును, దుంగభద్రానది యుత్తరమునందు నుండి నూతన విద్యానగర మొక నైసర్గిక పర్వతమయ దుర్గముగ నుండెను.

ఆ నగరమునకుఁ జుట్టును వలయాకారముగ నేడు ప్రాకారములు గలవు. ఈ ప్రాకారములు ఱాతిగుట్టలపై నెత్తుగఁ గట్టఁబడి యుండుటచే శత్రువుల కభేద్యముగ నుండెను. ప్రాకారములపై నందందు బురుజులు నిర్మింపఁబడి నిరంతరము రక్షక భటాళిచే సంరక్షింపఁ బడుచుండెను. సప్తమ ప్రాకార భాగమున సస్యానుకూలమై జలసమృద్ధములగు గొప్ప తటాకములు త్రవ్వఁబడెను. వానినుండి కాలువలద్వారా సంతతము జలము ప్రవహించుచుండఁ బలురకములయిన పంటలు విశేషముగఁ బండుచుండెను.

మొదటి ప్రాకారములోపలి ప్రదేశమున రాజమందిరములు, సేనాపతుల యావాసములు, టంకశాల, ధాన్యపుఁగొట్లు కట్టఁబడినవి. అట్లత్యంత రామణీయకముగ సృష్టింపఁ బడిన విద్యాపురీవరము పదునాలుగు మైళ్ళ పొడవును, బది మైళ్ళు వెడల్పును గల్గియుండెను. ఈ నగర ముచ్చ స్థితియందు వెలుఁగొందినప్పుడిందలి జనసంఖ్య రమారమి ముప్పది లక్షలుండునని భావింపఁబడుచున్నది.

అట్లు విద్యారణ్యస్వామివారి యోచనాపటిమచేఁ బూర్తి గావింపఁబడిన పట్టణము వివిధవిద్యల కాలవాలమై యుండుటచే

విద్యానగరమనియు, నసమాన శూరశిఖామణుల కాటపట్టయి విజయఘోషలచే నలరారుచుండినందున విజయనగరమనియు విఖ్యాతినందెను. సర్వైశ్వర్య శౌర్య విద్యానిలయమైన విజయ నగర మా కాలమునఁ బ్రపంచమునఁ బ్రఖ్యాతిఁగాంచిన పట్ట ణములందెల్ల మిక్కిలి ప్రాభవము నెందియుండెను. అట్టి మహోన్నత పట్టణరాజమున హరిహరరాయలు క్రీ. శ. 1336 సంవత్సరమున పట్టాభిషిక్తుఁడయ్యెను. నాఁటి నుండియు విజయ నగర సామ్రాజ్యమునకు విజయనగరమే రాజధానియై రాజిల్లు చుండెను.

అప్పటినుండియే యీ సామ్రాజ్యచరిత్రము మేనుబులక లెత్తించు వీరరసప్లుతమగుచు వెల్గొందెను. హైందవాచార పద్ధతులఁ బాడుపఱచి, వారి రాజ్యములఁ గూలఁద్రోయుచుఁ నుప్పెనవలె నుప్పొంగి వచ్చుచుండిన యవనులధాటి నరికట్టి, హైందవ సంస్కృతిని సంరక్షించిన దీ సామ్రాజ్యమే ! అయ్యది దక్షిణాపథమున భారతీయ ప్రతిభను మహాసేతువువలె నిర్మింపఁ జేసినది. తురుష్కుల దాస్యశృంఖలల దెగద్రెంచివైచి, స్వాతంత్ర్య పతాకము బునఃప్రతిష్ఠించి, విజయసందేశమును బంపిన దీ విజయనగర సామ్రాజ్యమే !! సంగమ, సాళువ, తుళువవంశాది రాజేంద్రుల నాయకత్వమున నది యాంధ్రుల కీర్తిస్తంభమై యలరారినది.

ఆ రాజాధిరాజుల పాలనమున, నీ సామ్రాజ్యము సకల శ్రేయముల కాకరమై యొప్పినది. వారి భాషాపోషణమున, విశిష్టసాహిత్య మభివృద్ధి నొందినది. ఉత్తమోత్తమ కావ్య

రాజములు వెలువడినవి. వారి కళాభిలాషమువలన విజయనగర మనల్ప శిల్పకళాఖండమై దీపించినది. ఆనాఁటి దేవాలయ గోపుర ప్రాకారములందును, రాజప్రాసాదములందును, వివిధములగు కట్టడము లందును, శిల్పకళాలక్ష్మి తాండవించినది. ఇంతకును విద్యారణ్యతపోధనుని శక్తిప్రభావమున విజయనగరసామ్రాజ్యము విస్తరించి నిస్తుల జయఘోష నిఖిలదిక్కులను బిక్కటిల్ల జేసినదను టతిశయోక్తి కానేరదు.

హరిహరరాయ లట్టులు విజయనగరమున సింహాసన మధిష్ఠించి విద్యారణ్యుల మంత్రాంగ మహిమచేతను, సోదర సహాయమునను ప్రజల కే యిక్కట్టులురాకుండఁ జక్కఁగాఁ బరిపాలనము సాగించుచుండెను.

---

## ౨౪

అది యొకనాఁటి యర్ధరాత్రము. గాఢాంధకారము నలుగడలను వ్యాపించి కన్నుఁబొడుచుకొన్నను డెన్ను గానరాకుండెను. ప్రకృతియంతయు నిశ్శబ్దముగ నుండెను. తుంగభద్రానదీతీరపు టపవులనుండి యప్పుడప్పుడు బెట్టిదమగు ధ్వనులుమాత్రము వినఁబడుచుండెను. ఆ యేటియొడ్డున నొక దేవాలయముగలదు. దాని ముఖమంటపము ప్రాకారము నానుకొని యెత్తుగనుండెను. ఆ నిశీథమున నిద్దఱువ్యక్తులు నల్లని యుడుపులుధరించి, చీఁకటి రూపమునఁ జేరుచు దేవళసమీపమునకు వచ్చిరి. ఆలయప్రాకారమును బ్రాకి ముఖ మంటపముపైఁ గూరుచుండిరి. అందుఁజేరి వారిలో వారిట్లు భాషింపఁదొడఁగిరి.

‘మిత్రమా! ఇదియేనా మనము తలంచిన స్థలము?

‘అవును. కొంతసేపు మనమిందే కూర్చుండవలయును.’

‘ఎందులకు? గమ్యస్థానమునకే పోఁగూడదా?’

‘ఇప్పుడే పోరాదు. బుక్కరాయల సైన్యాధిపతియు, మంత్రియు రహస్యవృత్తాంతముల నరయుటకీ ప్రాంతమునఁ దిరుగాడుచుందురఁట.’

‘అట్లయిన మన మతి జాగరూకులమై వారిజాడ నరయవలెను.’

అంతియకాదు. వారిని దొంగ వ్రేటున గడతేర్చితిమేని మన రాజ్యమున కొక ప్రబలశత్రువు నశించును.'

'అట్లయిన మన రొట్టెవిరిగి నేతిలోఁ బడ్డట్లే!'

'కా కేమిటి? మనమీ కార్యమును సాధించితిమా సుల్తాను వారి యనుగ్రహపాత్రుల మగుదుము.'

'పిచ్చివాఁడవు అనుగ్రహమేమిటి? గొప్ప పదవు లందఁ గలము.'

అంతలో నేదో యలికిడి యైనట్లుండెను. వారిరువురును భీతిల్లి మంటపస్తంభముల ప్రక్కన నక్కిరి. వారివేషములును నాలోచనములును జూడ విపరీత బుద్ధులకు లోనగునట్లుండెను. అత్యాశ పెనుభూతమువలె వారిలో వ్యాపించియుండెను. వారు తలంచినపని యవలీలగా నెఱవేఱుననియుఁ, బిమ్మటఁ దామొక మంత్రియుద్యోగమో, సేనాయకత్వమో వహింపవచ్చుననియు నువ్విళులూరుచుండిరి. అట్టియెడ నా సమీపముననుండి యొక నక్క కూసెను. ఆ కూఁతకు వారెంతయు నులికి పడిరి. జార-చోరాది వ్యసనములఁ దవిలిపోవువాని కెండుటాకు కదలినను భయ మావహించునుగదా! అదిరిపడిన చోరద్వయ మంతలో మరల ధైర్యముఁ దెచ్చుకొని గమ్యస్థానమును గూర్చి పోవుట కచ్చటి నుండి కదలెను.

అంతలో గొంతదూరమున వారికి గుఱ్ఱముల గిట్టలచప్పుడు వినవచ్చెను. ఆ ధ్వనివచ్చినవైపును మిక్కిలి జాగరూకతతో బరికింపుచు వారు నడచుచుండిరి. ఆ సవ్వడి వారికి మఱింత

సమీపమునకే వచ్చెను. వెంటనే వారచ్చటఁగలయొక ఱాతిగుట్ట వెనుకభాగమునకేగి దాగిరి.

ఆ యాశ్వికులు గుఱ్ఱముల వడిఁ గొంత తగ్గించి నడుపుచు వచ్చి యా గుట్టలకడనే గుఱ్ఱముల దిగిరి. అట్టి చీఁకటి యందు సైతము వారి గంభీరాకారమును బట్టియు, ధరించిన కవచము లను బట్టియు, వారు వీరుల వలెఁ గన్పట్టుచుండిరి. వారి నడుములనుండి వ్రేలాడు కటకుకరవాలములను గనుఁగొన్న భయము గొల్పుచుండెను. వా రటుల హయముల దిగి చెంతఁ గల యొక ఱాతిపై గూరుచుండి యిటుల మాటాడుకొనిరి.

"విజయనగర సామ్రాజ్యము స్థాపింపఁబడినపిమ్మట శత్రుపీడ వదలెనని సంతసించితిమి. కాని యింకను శత్రుశేష మున్నది.'

"అందులకనియే ఋణ, అగ్ని, శత్రుశేషము లుంచరాదని పెద్దలందురు."

"ఎంతని శ్మశ మొనర్చుచున్నను ప్రొద్దుపొడుచు నప్పటికిఁ బుట్టుకొనివచ్చు పుట్టకొక్కులవలెనున్న వీ యరుల మూఁకలు!"

"నిజమే! మనమింక సర్వసన్నాహము లొనర్చుకొని వైరుల నామావశేషులఁగావించి, విజయనగర నామమును సార్థక పఱ చుట మంచిదికాదా?

"నీయూహా మంచిదే! అట్టి కార్యమునకుఁ దగిన సమయ మాసన్నముఁ గావలయును. తొందరపడి పనులఁ గాచిన ప్రొద్దు కుంకదు."

"సత్యము వచించితిరి. కాని పగటి పోఁగరుబోతుతనపుఁ గిరాతకచర్యల నరికట్టినఁగాని ప్రజలకు శాంతిసౌఖ్యములు చేకూరవు."

"అవును. అది యవశ్యాచరణీయము. అందులకనియేగదా మన కీ నిశీథపుఁబ్రయాణములు !"

"మన మెంతయు శ్రద్ధగైకొనుచుండ మహారాజావారు గూడ గూఢచారుల నరయునిమిత్త మిట్లే తిరుగుచుందురు. అది నిరపాయ కరమైన విషయము కాదుకదా స్వామీ!"

"ఆ విషయమును నేను చెప్పిచూచితిని."

"మఱి వారా కార్యమును మానలేదేమి ?"

"బుక్కరాయల శౌర్యసాహసాదు లద్వితీయములయినవి. ఆయనకుఁ బ్రజలపైఁగల యనురాగము వచింప నలవికానిది. ఈ రెండు కారణములవలన శత్రువుల పీచమడంచుటకును, బ్రజలకు శాంతిమొనఁగూర్చుటకు నా రాజేంద్రుఁడు ప్రచ్ఛన్న వేషమునఁ దిరుగుచుండును."

"ప్రజలను గన్నబిడ్డలవలెఁ గాపాడుచుఁ బాలించు మహారాజులెందఱో పూర్వమట్లే సంచరించుచుండెడివారఁటకదా!"

"నిక్కువమే! అది రాజధర్మము. (కొంచెమాఁగి నెమ్మదిగా) గుట్టవెనుక నవ్వడి గ్రహించితివా?"

"గ్రహించితిని. అప్రమత్తులమై యుండి వారిచేష్టలఁ దెలిసికొందము."

వారట్లు మాటలాడుకొనుచున్న సమయమున మన చోర శిఖామణులకుఁ దొందరపాటుకలిగెను. సంభాషించుకొనువారు మంత్రి, సైన్యాధిపతులై యుందురని వా రెంచిరి. తాము దల పోసినట్లు రాజసంరక్షణకై వారట్లు తిరుగుట నిజమేయని నిశ్చ యించుకొనిరి. ఆ సమయమును మీఱిపోనిచ్చుట మంచిది కాదని, నెమ్మదిగ నొరలనుండి కరవాలము లూడలాగి నిశ్శబ్ద ముగ గుట్టఁ దిరిగివచ్చిరి. వెనుకనుండి కూరుచున్న వారిని గాట ముగ నీఁటెలతోఁ బొడిచిరి. ఆ పోటులతో వారు పరలోక గతులగుదురని దొంగలు తలంచిరి.

ఆ యోధులిర్వురును గవచధారులై యున్నందునను, మును ముందుగనే జాగరూకతతో నున్నందున నీఁటెపోటులు వారి కేమాత్ర మపాయముఁ గలిగింపలేదు. వెంటనే యా వీరద్వ యము జింకలపైఁ దుముకు సింగములవలెఁ జెంగున దుమికి వారిపైఁ బడెను. మేటి వీరభటశతమును సైతము గోటమీటఁ గల యా శౌర్యరాసుల కా దొంగ లొక లెక్కయా!

ఆ వీరవరు లొక త్రుటికాలమున నా దొంగలశిరముల ఖండించి, యా శిరములఁ గైకొని, యశ్వముల నధిరోహించి వడివడిగ నేగిరి. వారటులఁ బయనించి విజయనగర సింహ ద్వారముచెంతకుఁ జేరిరి. అట నప్రమత్తులై యున్న రక్షక భటుల కా శిరముల నొసఁగి, 'పరీక్షార్థము వానిని రేపు కొలు వుకూటమునకుఁ గొనిరం'డని యాజ్ఞాపించి, యా వీరాగ్రణులు కోటలోని కేగిరి.

---

## ౬

హరిహరరాయల మరణానంతర మాతనిసోదరులలోఁ బ్రఖ్యాతివహించిన బుక్కరాయలు విజయనగర రాజ్యాధిపత్యము స్వీకరించెను. బుక్కభూపాలుఁడు రాజ్యారూఢుఁడు కాఁగానే రాజ్యవృద్ధినొనరింప మొదలిడెను. ఆయన యద్వితీయ శౌర్య సాహస గుణములే యందులకుఁ గారణము. క్రమక్రమముగ నీతఁడు తన యవక్రపరాక్రమముతోఁ దుంగభద్రానదికి దక్షిణభాగముల జయింప మొదలిడెను. తూర్పునఁ గల కళింగ, ఓఢ్ర దేశములఁ గూడ జయించెనని శాసనములవలనఁ దెలియుచున్నది.

బుక్కభూపతియట్లు రాజ్యమును బెంపుసేయుటకై గొప్ప సైన్యముల సమకూర్చెను. వీరాధివీరులని పేరుగాంచిన దండనాథులాతని దండనుండిరి. వారిలో మల్లినాథుఁడు మిక్కిలి పేరు పొందెను. ఈ సేనాధిపతి తన నాయకత్వమునఁ బలుసారులు తురుష్కులు, పాండ్యులు లోనుగాఁగలవారల నోడించి విశేష గౌరవము సంపాదించెను. బుక్కరాయల కీతనిపై యభిమానము మెండు. సర్వవిధముల నాతఁడు సామ్రాజ్య సంరక్షణకు ముఖ్యుఁడై యుండుటయే యందులకుఁ గారణము.

బుక్కరాయల రాజ్యాభివృద్ధికి బ్రధాన కారణుఁడగు నింకొక మహామహుఁడు కలఁడు. అతఁడే మాధవమంత్రి. ఈయన గొప్ప మంత్రాంగవిదుఁడు. విద్యారణ్యునివలె నితఁడును గొప్ప పండితుఁడు. చాల గ్రంథముల రచించినాఁడు. ఈతఁడు రాజకీయ వ్యవహారదక్షుఁ డగుటయేగాక సేనానాయకత్వము వహించి

సాహసమునఁ బోరఁగల సమర్థుఁడు. తురుష్కులరాజధానియగు గోవాపట్టణముపై దండెత్తి మిక్కిలి చాకచక్యముగ సైన్యముల నడిపించి యా నగరమును జయించెను. రాజకీయములందు మాధవమంత్రి బుక్కరాజునకుఁ గుడిభుజముగ నుండి యుచితము లగు నాలోచనల నొసంగుచుండెను.

బుక్కరాయలున కేడ్గురు పుత్రులు. వారును తండ్రివలె రాజకీయములందు నిపుణులు. అట్టి కుమారులును, మంత్రివర్యుఁడును, సేనాపతులును బుక్కరాయలునకు సమస్తవిధములఁదోడ్పడి విజయనగర సామ్రాజ్యమును సర్వతోభిముఖముగ నభివృద్ధి పఱచిరి. ఆకాలమున నా రాజ్య ముత్తరమునఁ గృష్ణానదినుండి దక్షిణమున మధురానగరమువఱకును వ్యాపించియుండెనఁట.

బుక్కభూనాథుఁడు తనరాజ్యమును రాష్ట్రములుగ విభజించి యొక్కొకదాని కొక ప్రతినిధిని నియమించెను. కొన్ని రాష్ట్రములకుఁ దనపుత్రులును, మఱి కొన్నిఁటికి సమర్థులగు సేనాధిపతులను నియోగించెను. ఇన్నివిధముల రాజ్యమును గట్టుదిట్టముఁజేసి పరిపాలనచక్రమును ద్రిప్పఁదొడఁగెను.

అంతటి ప్రజ్ఞాధురంధరత్వమున పరిపాలన సాగించుచున్నను బుక్కరాయలునకు శత్రురాజ్యములు లేకపోలేదు. హరిహరరాయలకాలముననే హాసన్‌గంగూ యను నతఁడు స్వతంత్రుఁడై దక్షిణదేశమున బహమనీరాజ్యమను నొక మహమ్మదీయ రాజ్యమును స్థాపించెను. నాఁటినుండియు విజయనగర బహమనీ రాజ్యముల కప్పుడప్పుడు యుద్ధములు జరుగుచుండెను. మహమ్మదీయులు గూఢచారులను బంపించి విజయనగర రాజ్య

రహస్య వృత్తాంతము లరయఁ బ్రయత్నించుచుండిరి. విజయ నగర దండనాథులను గూఢముగ మట్టుపెట్ట గట్టిజతనము లొనరించుచుండిరి.

అట్టి ఘాతుక చర్యల నరికట్టుటకు బుక్కరాయలును, మాధవమంత్రియు వేవిధముల యత్నించుచు నాకార్యము నందుఁ గృతకృత్యులగుచుండిరి. క్రిందటి ప్రకరణమునఁ జెప్పఁ బడినట్లు నిశీథమునఁ జరించు గూఢచారులఁ బట్టుకొనుటకు మాధవమంత్రియు, మల్లినాథుఁడు నర్ధరాత్రమున బయలుదేఱిరి. దొంగప్రేటునఁ బ్రజాద్రోహములఁ దలపెట్టు దుండగులజాడలఁ గనిపెట్టి వారిని సంహరించి తెచ్చి రక్షకభటుల కప్పగించిరి.

మఱునాఁడుదయమునఁ గొలువుకూటమున బుక్కరాయలు సింహాసన మధిష్ఠించి యుండెను. మంత్రి సర్వసైన్యాధ్యక్షులు రాజున కిరువైపులఁ గూరుచుండియుండిరి. తక్కంగల దండనాథులుమున్నగుప్రభుత్వోద్యోగులెల్ల రుచితాసనముల నాసీనులై యుండిరి. సభయందు వివిధరాజకీయ సమస్యలు చర్చింపఁ బడెను. బహామనీరాజ్యమును గూర్చియు, వారి దుండగముల గుఱించియు మంత్రిశేఖరుఁడు వాక్రుచ్చెను. క్రిందటిరాత్రి సంఘటిల్లిన యుదంతమునుగూడ సభ్యులకుఁ దెలియపఱచెను.

అంతలో నిరువురు భటులు ఖండించిన రెండుతలలఁగైకొని కొలువునకు వచ్చి, రాజ మంత్రి సేనాపతులకు నమస్కరించి నిల్చియుండిరి. అంత వా రా శిరములఁ బరీక్షించి, వారు బహామనీరాజ్యపు గూఢచారులనియు దుష్కృత్యము లొనరింప వచ్చిరనియుఁ బ్రకటించి, భటులచే నా శిరములఁ బంపివైచిరి.

అప్పుడు బుక్కరాయలు సభాసదుల నుద్దేశించి "సభికు లారా! చూచితిరా బహమనీ రాజ్యాధిపతుల దుర్ణయములు? నేఁటి కైదుదినముల క్రిందటఁ గొందఱు తురుష్కభటు లర్ధరాత్ర మునఁ దుంగభద్రా నదీతీరమునకేతెంచి, వ్యాపారార్థముఁ బడ వలలోఁ బయనించువారల వధించి, ద్రవ్యమును దొంగిలించు కొని పోయిరి. క్రిందటిరాత్రి మంత్రిసేనాపతుల వధింప నుంకిం చిరి. వా రప్రమత్తులై యుండుటచే నది తప్పిపోయెను. కావున మీ రెల్లరు జాగరూకులై యుండి బహమనీ రాజ్యమును జయిం చుట కుద్యుక్తులై యుండుడు. శత్రురాజ్యమును నిర్జించునంత వఱకు మనము నిదురపోఁగూడ" దని వచించి, నాఁటికి సభ చాలించెను.

ఆ విధముగ బుక్కరాయలు యవనులవలనఁ గల్గు నుపద్రవ ములఁ దప్పించుచు రాజ్యసంరక్షణకు వలయు నన్ని సౌకర్యములఁ జేకూర్చెను. ఈతఁడు తన యన్నకాలమునుండియు రాజ్యాభి వృద్ధికొఱకనేకరీతులఁ గృషిసలిపెను. ఆ రాజ్యము యొక్క కీర్తిని, వైశాల్యమును హెచ్చించెను. శక్తిసామర్థ్యములందును, సంపదలయందును, విస్తీర్ణమునందు నీతఁడు తన రాజ్యమును బహమనీరాజ్యముకన్న ద్విగుణీకృతమగునట్లు చేసెను. మల బారు, సింహళము మొదలగు రాజులకడనుండి వారి రాయబారు లద్వారా ప్రతిసంవత్సరము మిగుల వెలగల కానుక లందు చుండెను.

సముద్రపురేవగు గోవాపట్టణమును, మాల్గాము మొదలగు దుర్గములను స్వాధీనపఱచుకొని, యీ రాజేంద్రుఁడు సర్వ స్వతంత్రుఁడయ్యెను. విజయనగరమున గొప్ప రాజమందిరము

లను గట్టించెను. వర్తకస్థానములందుఁ గళాలలితములైన కట్టడములఁ బెక్కింటిని నిర్మింపించెను. చాలదేశములనుండి వర్తకప్రముఖులీ పట్టణమున కేతెంచి నివసింపుచుండ, దక్షిణ భారతమునఁగల వర్తకస్థానములలో నీపట్టణము మిక్కిలి ప్రఖ్యాతి గాంచెను.

బుక్కరాయలు తన యాస్థానమున గొప్ప విద్వాంసుల నుంచెను. ఏటేట వారి సామర్థ్యమునుబట్టి పారితోషికము లొసఁగుచుండెను. ఆ సమయమునందే వీరవరేణ్యులకును వారి వారి పరాక్రమాతిశయములఁ బరీక్షించి, తగిన బహుమతు లిచ్చుచుండెను. ఈతఁడు శైవమత మవలంబించి యున్నను జైన వైష్ణవమతముల సమబుద్ధితో నాదరించెను.

బుక్కనృపాలుఁడు ప్రజానురంజకముగఁ బాలించుచుండ జనులెల్లరు నాతని యందు భయభక్తివిశ్వాసములతో మెలఁగుచుండిరి. సస్యసమృద్ధిఁ గల్గించుట కీతఁడు రాజ్యమంతంతటను జెఱువులు, కాలువలు త్రవ్వించెను. ప్రజల కందుబాటులో నుండు విధమున నీతఁడు శిస్తు వసూలు జేయుచుండెను. అట్లు ప్రోగుచేసిన ద్రవ్యమును రాజభోగముల కేమాత్రము వినియోగింపక రాజ్యాభివృద్ధికే వినియోగించుచుండెను. సమర్థుఁడై రాజనీతి చతురత్వమున రాజ్యనిర్వహణముఁ గావించి, ప్రజాపోషకుఁడని పేరు గాంచి బుక్కరాయలు క్రీ. శ 1377 సంవత్సరమున స్వర్గస్థుఁడయ్యెను. పితృసమానుఁడై తమ్ము నన్నివిధముల జక్కఁగా నేలిన యేలిక దివి కేగినందులకు విజయనగరమునఁగల ప్రజలెల్లరుఁ బెల్లు దురపిల్లిరి.

---

# ౭

అన్ని విషయములందును పేరును ప్రతిష్ఠయు నందిన విజయనగరచక్రవర్తులలో బుక్కరాయలొక్కరుఁడు. ఆతని మరణానంతర మాతని జ్యేష్ఠపుత్రుఁడు హరిహరరాయలు రాజ్యమునకువచ్చెను. ఈతనినే రెండవ హరిహరరాయ లందురు. ఈ రాజేంద్రుఁడును దండ్రివలె సకలజన సమ్మతముగ రాజ్యమేలెను. ఈతఁడు మాండలికరాజులను జయించి 'మహారాజాధిరాజ రాజపరమేశ్వర' బిరుదమందెను. మాండలిక నృపాలు రెల్లరును హరిహరరాయల సర్వజనామోదమగు పాలనమునకు సంతసించి, యాతనికి సామంతులుగ నుండుట కంగీకరించి, యట్లే వర్తించిరి.

రెండవ హరిహరునికడ మాధవమంత్రియు, విద్యారణ్యుని సోదరుఁడగు సాయనాచార్యుఁడు మున్నగువారు మంత్రులుగ నుండిరి. దండనాయకులలో నుద్దండుఁడగు ముద్దప్ప దండనాయకుఁడు సర్వసైన్యాధ్యక్షపదవి నందియుండెను. ఈతఁడు సైన్యాధిపతియై యుండుటయేకాక మంత్రిగఁ గూడనుండి మంచిపేరందెను. ఈ భూపాలుని కాలమునఁ దురుష్కులతో జరిగిన పెక్కుయుద్ధములందు ముద్దప్ప దండనాయకుఁడు ప్రముఖపాత్రవహించి విజయనగర సామ్రాజ్య రమాలలామను సకలవైభవ సంశోభితను గావించెను. ఈతని రణపాండిత్యమును జాటు యశోగాథలు, పెక్కు శిలాశాసనములవలనఁ దెలియవచ్చుచున్నవి.

ఇటుల మాధవమంత్రి, సాయనాచార్యుఁడు, ముద్దప్ప దండనాయకుఁడు లోనగువారి రాజకీయ నిపుణత్వమున హరిహర

రాయలు దక్షిణ దిగ్విజయయాత్రలుచేసి చోళ, పాండ్య, కేర ళాది భూపతులను జయించెను. తన్నెదిరించిన శాత్రవుల ననేకుల నాతఁడు బందీకృతులఁగావించి రాజధానికిఁ గై కొని వచ్చెను. తరువాత నుదయగిరి రాజ్యమును గెల్చి యీతఁడు తన పుత్రుఁ డగు దేవరాయల నట యువరాజుగఁజేసెను.

వస్త్రములు, ధాన్యములు, సుగంధద్రవ్యములు, చేతిపనుల వలన నిర్మింపఁబడిన సామగ్రులు మొదలగువాని కీ రాజేంద్రుఁడు పన్నులు వసూలు చేయుచుండెనట. అందుచే నా కాలమున వ్యాపారము విరివిగ సాగుచున్నట్లు తెలియుచున్నది. హరిహర రాయలుగూడ బెక్కు వర్తకసంస్థలఁ గట్టించి వ్యాపారమును బోషించెను.

ఈ రాజన్యుఁడు హిందూమతాంతరులైన జైనులను గౌర వించి వారికిఁ దన రాజ్యమున నున్నతోద్యోగములిచ్చినట్లు కాన వచ్చెడి ఈ కార్యమువలన హరిహరరాయలునకు నన్యమతస్థు లచే సైతము 'సర్వమతముల సమాదరించిన ఘనుఁడ'ని గొప్ప బిరుదునామము సెలంగెను.

ఈతఁడు విజయనగరమును బాలించుకాలమునఁ గొండవీడు నందుఁ గుమారగిరిరెడ్డి రాజ్యము సేయుచుండెను. ఆతఁడు సర్వ స్వతంత్రుఁడై యుండెను. కాని యోరుగల్లును బాలించు రాచసింగమనాయకుఁడు హరిహరరాయలునకు సామంతుఁడుగ నుండెను. తరువాతఁ గొంతకాలమునకు రెండవ హరిహర భూపాలుఁడు కీర్తిశేషుఁడయ్యెను.

అతఁడు మృతిసెందగనే యాతని పుత్రుఁడగు దేవరాయలు విజయనగర సింహాసన మధిష్ఠించెను. హరిహరరాయల కాలమున

సీతండుదయగిరికి యువరాజుగ నుండెను. ఆసమయమున సీతనికడ సిద్ధయదన్నయ యనునతండు మంత్రిగ నుండెను. దేవరాయలు విజయనగర సింహాసన మాక్రమింపగనే సిద్ధయనే తనకు ముఖ్య మంత్రిగం జేసికొనెను. దేవరాయలును దండ్రివలె మహమ్మదీయులను యుద్ధములందు జయింపుచుం జక్కంగా రాజ్యపాలన మొనరింపుచుండెను. ఈతని పాలనమున నంతకన్న విశేషము లెవ్వియులేవు. ఇతనికిం దరువాత నీతని సుతుండు విజయబుక్క రాయలు రాజయ్యెను. ఈతండొక వత్సరము మాత్రమే రాజ్య మేలెను. పిమ్మట నీతని పుత్రుండు ప్రౌఢదేవరాయలు రాజయ్యెను.

ఈతనినే రెండవ దేవరాయలందురు. ఈ రాయలును విజయ నగర రాజులలోం బేరందినవాండు. ఇతండు రాజ్యమునకువచ్చిన పదపడి రాజ్యభాగములకుం దన సోదరుండు మొదలగువారిని రాజ్యప్రతినిధుల నొనరించెను. ఈ రాజవర్యునకు సింగనదండ నాయకుండు, లక్ష్మణ దండనాయకుండను నిరువురు మంత్రి పుంగవు లుండిరి. అందు లక్ష్మణ దండనాయకుండుంగూడ నొక ప్రతినిధిగ నుండి రాజకీయ కార్యములపై సముద్ర ప్రయాణ మొనరించి సింహళద్వీపమున కేగెను. అచ్చటి రాజుతో విజయ నగర సామ్రాజ్యమునకు స్నేహసంబంధములను గుదిర్చి, యా రాజును సామంతుండుగ నుండునట్లొనరించెను. ఇట్లే దండనాయ కుండు తన ధీవిశేషమున సామంతరాజులకడనుండి కొల్లగా ద్రవ్య మును రాబట్టి సామ్రాజ్యమునకుం గోట్లకొలది ధనము సమకూ ర్చెను. సింహళద్వీపమున కేగివచ్చిన తరువాత నీ మంత్రిశేఖరు నకు 'దక్షిణ సముద్రాధీశ్వరుం'డను బిరుదము వచ్చెను.

ప్రౌఢదేవరాయలు మిక్కిలి పరాక్రమవంతుఁడు. విశేషముగ రాజకీయప్రజ్ఞ గలవాఁడు. రాజ్యపరిపాలనా విషయమునం దత్యంత నిపుణుఁడు. భాషాప్రియుఁడు, కవి పండిత పోషకుఁడు. కవిసార్వభౌముఁడగు శ్రీనాథ మహాకవికిఁ గనకాభిషేక మొనరించిన దీ రాజేంద్రుఁడే.

ప్రౌఢదేవరాయ లిన్ని సద్గుణములు కలిగియుండి రాజ్యాభివృద్ధియందుఁగూడ నెక్కుడు శ్రద్ధవహించెను. కొండవీడు, వినుకొండదుర్గముల జయించి, యా దుర్గాధిపతులచేఁ గప్పముఁ గొనుచుండెను. ఆతని కట్టి విజయములు లభించుటకుఁ దెనుఁగురాయఁడు, పంట మైలారెడ్డి యను సైన్యాధ్యక్షులు కారకులు. వీరు మిక్కిలి శౌర్యసంపన్నులై దేవరాయలునకుఁ గరము తోడుపడుచు సాహిత్యమునం దభిరుచి కలిగియుండిరి. వీరిరువురు సైతము శ్రీనాథుని మిక్కిలి గౌరవించి, కస్తూరి మొదలగు బహుమతు లొసంగిరి.

ప్రౌఢరాయ లటులఁ బలు కోటలజయించి సామంతరాజుల సాయమున, రాజ్యమునం దేలోటు రానీయకుండఁ బాలించుచుండెను. ఈతనికడ మహావిద్వాంసుఁడగు డిండిమభట్టను నొక కవివరేణ్యుఁడుండెను. ఈ కవీశ్వరుఁడు పెక్కుమంది కవి పండితులఁ బాండిత్యమున నోడించి 'కవిసార్వభౌమ' బిరుద మందియుండెను. తాను పండితుల గెల్చిన విజయచిహ్నముగ నొక కంచుఢక్కఁ జేయించి, 'కవిత్వమునఁగాని, పాండితీ పటిమయందునఁగాని తన్నెవరైన జయించినచోఁ గంచుఢక్కను బగులఁగొట్టి, కవిసార్వభౌమబిరుద మాతని కిత్తు'నని ప్రతిజ్ఞసల్పి,

నిరంకుశముగ రాయల యాస్థానమున విజృంభించుచుండెను. డిండిమభట్టేకాక రాయలసభలో ధర్మాధికారిగ "ముమ్మకవి" యను నొక విద్వాంసుఁడుండెను. ఈతఁడు సంస్థానమునకు వచ్చు స్వల్పకవులను తానే యోడింపుచు, మహాకవులైనచో రాజదర్శన మెంతకాలమున కిప్పింపకఁ దుదకెప్పుడో రాజాస్థానమునకు రావించి, డిండిమభట్టుచే నోడింపఁ జేయుచుండెను.

ఇట్లుండ నొక సమయమున సకల విద్యాసనాథుఁడు శ్రీనాథుఁ డేతెంచి ముమ్మకవి కడకరిగి "సర్వబంధమైన నేనయు కవిత సంస్కృతాంధ్రములఁ బలుకనేర్తు కావున మీా భూపాలుని యాస్థాన ప్రవేశమిప్పింపు"మని పలుతెఱంగుల నర్థించెను. అందుల కాతఁ "డట్లే"యని తలనూపి యెంతకాలమునకును రాయల దర్శనమిప్పింపకుండెను. శ్రీనాథుఁడు చాలకాలము నిరీక్షించి, యాతనివలన ఫలము గలుగదని తలఁచి మధురభావాలంకృతమైన పద్య మొకదానిని రచించి, యొక దూతవలన దేవరాయలున కందజేసెను.

ఆ పద్యమును దిలకించి, యందలి పదసౌష్ఠవమునకును, గవితా మాధుర్యమునకును గడుంగడు హర్షించి రాయలు శ్రీనాథమహాకవీంద్రునిఁ దన యాస్థానమునకుఁ బిల్వనంపెను.

మఱునాఁడు దేవరాయలు కొలువుకూటమున శ్రీనాథుని కవితాప్రదర్శనమున కేర్పాటు కావించెను. ఆ సభకు మంత్రి దండనాథులును, రాజప్రతినిధులును, సామంతరాజులును, పౌరులును శ్రీనాథుని కవనమువిని యానందింప వచ్చియుండిరి. అంత శ్రీనాథకవినాథుఁ డమితానందమున సభ కేతేర, రాజు

మిగుల గౌరవించి యుచితాసన మొసంగెను. గౌడ డిండిమ భట్టును, ముమ్మకవియు విద్యాధికారులుగ నుండిరి. అపుడు రాయలు శ్రీనాథుని బహువిషయములగూర్చి కవిత్వము జెప్పుమని యడుగ, నా కవీంద్రుఁడు గంగాప్రవాహ సదృశ్యమగు, మనోహరాశుకవిత్వముఁ జెప్పి రాయలు లోనుగాఁ గల సభికుల మనస్సుల రంజింపఁజేసెను.

తుదకు శ్రీనాథునకును డిండిమభట్టునకును బాండిత్యవివాదముజరిగెను. ఆ యుద్భటవాదమునందు శ్రీనాథుఁడు డిండిమభట్టు నోడించెను. అపరసరస్వతీ యవతార మనఁ దగు శ్రీనాథసుకవీంద్రుని యనల్ప పాండితీప్రభావమున కచ్చటి వారెల్లరు బెల్లుగ హర్షించిరి. అంతట డిండిమభట్టు లేచి చేతులుజోడించి, "సకల విద్యాసనాథా! శ్రీనాథ కవిసార్వభౌమా! మున్నునే ననేకపండితుల నోడించి కన్నుమిన్నెరుంగని విజయగర్వమునఁ జరించితి; నేఁడు నేనోడితి. సాక్షాత్తు వాగ్దేవీస్వరూపమగు మిమ్ములఁ బాండిత్యమున నెవ్వఁడు జయింపఁగలడు? మీరు కవితా సామ్రాజ్యమునకు సార్వభౌములు. నా యజ్ఞానమును మన్నించి, నా కవిసార్వభౌమ బిరుదమును గ్రహింపుఁడు. నా విజయడిండిమ చిహ్నమగు కంచుఢక్క నిప్పుడే యీ సభాముఖమునఁ బగులగొట్టెద"నని బహుభంగులఁ బ్రార్థించి తన ఢక్కను బగులఁగొట్టెను. నాటినుండియు శ్రీనాథునకుఁ గవిసార్వభౌమ బిరుదము లభించెను.

అంతటఁ బ్రౌఢదేవరాయలు శ్రీనాథకవీంద్రుని యసాధారణ విద్యావైశద్యమునకు మిక్కిలి యానందించి సకలవిద్వజ్జన సమ్మ

ఖమునఁ గవిసార్వభౌమునకుఁ జేతులారఁ గనకాభిషేకముఁ గావించెను. అట్లు స్వర్ణాభిషేకమునంది శ్రీనాథుఁడు పరిపరి తెఱంగుల దేవరాయలఁ బద్యరూపమునఁ బ్రస్తుతించెను. ఆ సందర్భమును బురస్కరించుకొనియే శ్రీనాథుఁడు సింగభూపాలుని యాస్థానమున కేగినప్పుడు సరస్వతీదేవి నుద్దేశించి "దీనారటంకాలఁ దీర్థమాడించితివి దక్షిణాధీశు ముత్యాలశాల" అనియు "పగులఁగొట్టించి తుద్భటవివాదప్రౌఢి గౌడడిండిమభట్టు కంచుఢక్క" యనియుఁ బద్యము రచించినాడు.

ప్రౌఢరాయల పాలనకాలమునఁ బారసీకదేశపు చక్రవర్తి యగు 'షాహరుజ' విజయనగరమునకు 'అబ్దుర్ రజాక్' అను నతనిని రాయబారిగఁ బంపెను. అతఁడు క్రీ. శ. 1443 సంవత్సరమున నేతెంచి విజయనగర ప్రాభవమునుగూర్చి యద్భుతముగ వర్ణించెను. దానివలన నానాఁటి విజయనగర వైభవము నేఁడు మనకుఁ గరతలామలక మగుచున్నది. ఆ పారశీక రాయబారి యిట్లు వర్ణించెను.

"1443 సంవత్సరమున ఏప్రిల్ మాసాంతమున విజయనగరమును జేరితిమి. మమ్ముఁ గొనితెచ్చుటకు రాయలు తన పరివారము నెదురుగఁ బంపించెను. నగరములోనికిఁ దీసికొనిపోయి వసించుటకు మాకొక సుందర మందిర మిప్పించెను. విజయనగరాధిపతి మహోదారగుణుఁడు, మిత్రుల బలదర్పితుఁడు. ఆయన రాజ్యము కృష్ణానదినుండి సింహళద్వీపమువఱకు వ్యాపించి యుండెను. విజయనగరమున నడకొండలవలె నుండు వేయి యేనుఁగులు గలవు. పదునొకండు లక్షల సైన్యము గలదు.

ఈ కాలమున నంతటి బలాధికుఁడగు రాజు మఱి యొక్క-రుఁడు లేడు. అంతటి ప్రాభవముగల పట్టణము ప్రపంచమున నున్నట్లు సైతము మేము విని యుండలేదు. విజయనగరము సప్త ప్రాకార పరివేష్టితము, అందు మొదటి దుర్గము కఱకురాళ్ళతో నెలకొనియుండి దుర్గమముగ నుండును. మొదటి దుర్గమునుండి మూడవ దుర్గమువఱకుఁగల ప్రదేశము సాగుచేయు పొలములు, తోఁటలు మున్నగువానితో నుండును. అటనుండి యేడవ దుర్గమువరకుఁగల స్థలము జనసంఘముల తోడను, రాజమందిరములు, గొల్లుకూటములు, సభామంటపములు మొదలగు వాని తోడను బొలుపాఱుచుండును.

అందలి వీథులు విశాలములై చక్కఁగా నుండును. వీథుల మధ్యమధ్య మంటపస్తంభము లలరారుచుండును. అచ్చట చ్చట వజ్ర వైఢూర్యములు కుప్పలు కుప్పలుగఁ బోసి యమ్ము చుందురు. పుష్పలావికలు పరిమళ భరితములగు బహువిధ ప్రసూనములు విక్రయించుచుందురు. అట్టి వీథులగుండ నేనుఁగులు, పల్లకీలు, బండ్లు మున్నగున వెల్లప్పుడు వచ్చుచుఁ బోవుచుండును. నునుపైన ఱాతికాల్వలలో బజారుల ప్రక్కలగుండ బరిశుద్ధజలము పట్టణ మంతయు బ్రవహించుచుండును.

రాజసౌధ ద్వారమున నొక సభామంటపము గలదు. అందు నిత్యము రాజకీయోద్యోగులు చుట్టుఁ గొల్చుచుండ దండనాథుఁడు కొలువుండును. ఖడ్గధారులగు రక్షకభటులందు గాపుందురు. ఏదైన విజ్ఞాపన మొనరింపఁదలచినవా రచ్చటికి వచ్చి మనవిఁ జేసికొందురు. దండనాథుఁడు వారి విన్నపముల విని,

విమర్శించి తీర్పుజెప్పి పంపివేయును. ఆతని తీర్పునకింకఁ బైతీరుపు లేదు. ఏనాఁటి కొల్వుకూటపువిషయము లానాఁడు దండనాథుఁడు రాజున కెఱింగించుచుండును. అతఁడు జేనికడ కేగునపుడు వేత్రధారులు బరాబరులు దెల్పుచుందురు. వందిమాగధుఁలు స్తోత్రపాఠములు చదువుచుందురు. వివిధ మంగళ వాద్యములు వాయింపుచుందురు.

రాణ్మందిరపు వెనుక భాగమున దండనాథుని గృహము కలదు. ఆతని మందిరము నానుకొనియే నాణెముల ముద్రించు టంకశాల కలదు. దానికెదురుగ నగరపాలుని సౌధము కలదు. ఆతనిక్రింద నగరపరిరక్షణకుఁ బండ్రెండువేల భటులుండిరి. టంకశాలకు సమీపమున నిరువది గజముల వెడల్పును రెండువందల గజముల పొడవునుగల యొక సుందరమైన వీధి కలదు. దాని కిరుపార్శ్వములఁ గళారాజితములైన శృంగారపుఁ గట్టడములు గలవు. వాని గోడలపై సింహ శార్దూలాది వన్యమృగముల చిత్రము లద్భుతముగఁ జిత్రింపఁబడి యున్నవి. అచటికి సామీప్యమున వేశ్యవాటిక కలదు. అందు నవయౌవన విలాసినులగు వెలయాండ్రు కలరు. సానులుమొదలు తుదకు వీధిలో వినోద కాలక్షేపము సలుపు దొమ్మరిపడుచులకు సైతము మిగుల విలువైన రత్నాభరణములు గలవు.

టంకశాల నానుకొనియే గజశాలకలదు. అందొక్కొక కరి కొక్కొక కట్టడము కలదు. మదగజముల నందు గొలుసులతో బంధింతురు. వాని యాహార పానీయములందు దినదిన మత్యంత శ్రద్ధ కైకొనఁబడుచుండును.

ఒకనాఁడు నన్ను రాయ లాస్థానమున కాహ్వానించెను. నేను రాజసభ కేగితిని. మంత్రి దండనాథాధి ప్రభుత్వోద్యోగులు తన్ను పరివేష్టించియుండ రాయలు సింహాసనాసీనుఁడైయుండెను. ఆనాఁడు నగరమెల్ల సుందరముగ నలంకరింపఁ బడియుండెను. ఒక మైదానమున గొప్ప పందిళ్లు వేయఁబడియుండెను. అందొక పందిరియందు రాజసింహాసన మమర్పఁబడి యుండెను. కొంత తడవు రాజందుఁ గూరుచుండెను. అప్పుడు మంజుల వస్త్రాలంకారులగు నటకులు నృత్యములు సలిపిరి. అట్లు మూఁడు దినములు జరిగెను. మూఁడవనాడు గూడ నట్టివేడుకలు జరిగెను. నాకు రాజదర్శన మానాఁడు నైనది."

ప్రౌఢదేవరాయని కిర్వురు భార్యలు. అందుఁ బొన్నలదేవికి మల్లికార్జునరాయలు, సింహాళదేవియందు విరూపాక్షరాయలు నుద్భవించిరి. దేవరాయల మరణానంతరము మల్లికార్జునరాయలు రాజయ్యెను. ఈతఁడును తండ్రి ననుసరించి రాజప్రతినిధుల సహాయమువలన రాజ్యచక్రము నడుపుచుండెను. ఈతని కాలమున బహామనీసుల్తాను, గపిలేశ్వర గజపతియు విజయనగరముపై దండెత్తిరి. మల్లికార్జునరాయ లతిధైర్యమున వారి నెదుర్కొని వారలఁ దరిమివేసెను. కాని యీతని చివరికాలమునుండి విజయనగరవైభవము తగ్గ నారంభించెను.

మల్లికార్జునరాయలు మరణించినపిదప నాతని తమ్ముఁడు విరూపాక్షరాయలు రాజయ్యెను. ఇతఁడు రాజ్యమునకు వచ్చినది మొదలు సంతత వారనారీలోలుఁడై మద్యపానప్రియుఁడై యుండి రాజకీయములందు విముఖత వహించి యుండెను. మంత్రి మొద

లగువారికి దర్శన మీయక తన యిచ్చవచ్చినరీతిని భోగపరాయణుఁడై యుండెను. ప్రజల కీతని పరిపాలన మేనూత్రమును రుచింపకుండెను. శత్రువు లీతని యసమర్థపుఁ బరిపాలన మూలమునఁ బ్రబలుచుండిరి. ఉత్తరమున గజపతులు కొండవీడు, రాజమహేంద్రవరము దుర్గముల జయించి స్వతంత్రులైరి. ఆ విధమున విజయనగరసామ్రాజ్యము క్షీణింపఁ దొడంగెను. దక్షిణమున బహామనీ సుల్తానులు, నుత్తరమున గజపతులు విజృంభించుచు సమయమువచ్చినపుడు విజయనగరము నాక్రమింప సన్నద్ధులై యుండిరి. ఇది యిట్లుండ నెంతకాలమునుండియో విజయనగరముక్రింద నున్న గోవాపట్టణమును 'మహమ్మద్ గవాన్' అనునతఁడు స్వాధీనపఱచుకొనెను.

హరిహరరాయ బుక్కరాయ ప్రౌఢదేవరాయాది సంగమవంశ రాజేంద్రుల పాలనమున వైవిధములఁ బెంపుసెందిన విజయనగర సామ్రాజ్యము మల్లికార్జున విరూపాక్షరాయల కాలమున దుర్బలస్థితికివచ్చెను. విరూపాక్షునికిఁ బిమ్మట నాతని సుతుఁడు సింహాసన మెక్కెనే కాని తండ్రివలెనే దుర్వ్యసనప్రియుఁడై యుండెను. ఇట్లుండ నాతని సేనాపతులలోఁ బ్రఖ్యాతివహించిన సాళువ నరసింగరాజు సమర్థతాహీనుఁ డగు రాజును దొలఁగించి తానే రాజ్యమేలఁగడంగెను. సంగమవంశ రాజులలో విరూపాక్షుని కుమారుఁడే కడపటివాఁడు. అప్పటినుండియు విజయనగర రాజ్యము సాళువవంశ రాజేంద్రుల యేలుబడిలోనికి వచ్చెను.

---

సాళువ నరసింహరాజు మల్లికార్జునరాయల కాలమునుండియు సామంతుఁడుగ నుండెను. ఈతఁడు గొప్ప సేనానాయకుఁడు. దక్షిణదేశమున నొక భాగమున కీతఁడు సామంతుఁడుగనుండి సమయము వచ్చినపుడు మల్లికార్జునునకుఁ దోడుపడుచుండెను. విరూపాక్షరాయల కాలమున నొకవంక మహమ్మదీయులును, మఱియొకవైపు గజపతులును బ్రబలుచుండిరి. వారివలన విజయ నగర రాజ్యమునకు ముప్పుకలుగునట్లుండెను. అది చూచి నరసింహరాయలు పరిపాలనా సామర్థ్యములేని విరూపాక్షునిఁ దొలఁగించి, సర్వస్వతంత్రుఁడై విజయనగర సింహాసన మాక్రమించి పాలింప మొదలిడెనని వ్రాసియుంటిమి.

సాళ్వ నరసింహరాయ లుమంచి విద్వాంసుఁడు. భాషాపోషకుఁడు. పలువురు కవుల నాదరించెను. రాజదేశిక కవి తన సాళ్వాభ్యుదయ గ్రంథమున నీ రాజవర్యుని పరాక్రమాది గుణములను గూర్చియు, ధర్మపాలనమును గుఱించియు బాగుగ వర్ణించెను. జైమినీభారత గ్రంథకర్తయగు పిల్లలమఱ్ఱి పినవీరభద్రకవి యీ రాజేంద్రుని సన్నిధి కేతెంచి తన మనోహర కవితాగోష్ఠివలనఁ జాల సంతోషపఱచెనఁట. అందులకా భూకాంతుఁడు పినవీరభద్రున కమూల్యములగు పారితోషికములిడి సత్కరించెనఁట. పినవీరభద్రాది కవీంద్రు లీ రాజేంద్రునిఁ గూర్చి పెక్కు నీతి పద్యములఁ జెప్పిరి.

ఈ నరసింహ భూవిభుఁడు రాజ్యమునకు వచ్చునప్పటికే వయసుమీఱిన వాఁడయ్యెను. అందుచేఁ జాలకాల మీతఁడు

రాజ్యమును బాలింపలేదు. విజయనగర సామ్రాజ్యమునుండి పగఱచే గెలువఁబడిన కొండవీడు మున్నగు దుర్గముల మరల జయింప నీతఁడు ప్రయత్నించెనేకాని వృద్ధుఁడగుటచేఁ దనకోరిక నీడేర్చుకొనలేకపోయెను. ఆతని యవసానసమయమున ముఖ్య మంత్రియగు తుళువ నరసరాజును బిల్చి "అమాత్యశేఖరా! నేను రాజ్యమునకు వచ్చినతరువాత, నంతకుఁ బూర్వము శత్రువులచేఁ గైకొనఁ బడిన మన రాజ్యభాగముల మరల జయింప నభిలషించితిని. కాని కొండవీడును, రాయచూరును మనకుఁ జిక్కలేదు. మీరెన్నికష్టములకైనను నోర్చి, గట్టి ప్రయత్నము లొనరించి, నా యంత్యకాలపుఁ గోరికను సఫల మొనర్చుటకు నైన నాదుర్గముల జయింపుఁ" డని నుడివి రాజ్యభారమును నాతని కప్పగించి పరలోకగతుఁడయ్యెను.

తుళువ నరసరాజు సాళువ నరసింహరాజు కడ మంత్రిగను, సేనాపతిగ నుండి బుద్ధిబలమునను, బాహుబలమునను బెక్కు విజయముల నొడఁగూర్చి మిక్కిలి కీర్తి నందెను. ఈతని పూర్వులు సైతము విజయనగరసామ్రాజ్యాధిపతులయొద్ద దండనాయకులుగ నుండి యఖండయశ మార్జించిరి. కవులను బోషించి కృతులందిరి. ఆ కృతులలో వారి శౌర్య సాహస గుణాదులు వర్ణింపఁబడినవి.

తుళువ నరసరాజటుల రాజ్య మప్పగించుకొని, సాళువ నరస భూపతి పెద్దకుమారుని రాజ్యాభిషిక్తునిఁ గావించెను. అతఁడు యుక్తవయస్కుఁడు గాకపోవుటచేత మంత్రియే రాజకీయములఁ జక్కదిద్దుచుండెను. అట్లుండ నూతనముగ రాజ్యాభిషిక్తుడైన నరసింహరాయల కుమారుని విరోధు లెవ్వరో గుప్తముగ వధించిరి. రాజ్యాభిలాష గలవాఁడై నీతిని విడిచి మంత్రియే యీ పాప

మున కొడిగట్టెనని కుమార రాయల వధించినవారలే తుళువ నరసరాజుపై నిందమోపిరి. రాజకుమారుఁడు నిష్కారణముగ వధింపఁబడుటకును, దనపై నింద మోపఁబడుటకును నరసరాజు మిక్కిలి వగచి రెండవ రాకుమారుని సింహాసన మెక్కించెను. తొంటియట్లు రాజ్యాధికారము నిర్వహింపుచుండెను.

నరసింహరాజు పెద్దకుమారుని వధించిన హంతకులు చూచాయగఁ దెలియవచ్చిరి. వారిపై నేరము స్పష్టముగ నిర్ధారణ కానందున మంత్రి యేమిచేయుటకు వీలుపడదయ్యెను. నరసింహ రాయలు రెండవపుత్రునకు మాత్రము "నీయన్నను వధించిన దుండగులను గూర్చి యొకకంటఁ గనిపెట్టియుండు" మని నరసరాజు రహస్యముగ వచించెను. కాని మంత్రిహితోపదేశ మెంతమాత్ర మా బాలుని చెవికెక్కకుండెను. హంతకులని యనుమానించిన వారితోడనే యాతఁడు స్నేహమొనర్చుచుండెను. అది మంత్రి కెంతయుఁ గష్టతరముగ నుండెను. పలురీతుల నాతని వారింపఁ జూచెను. నయభయములఁజెప్పి విసిగివేసరెను. ఎన్ని చేసినను బాలరాజు హంతకులతోఁ జెలిమిసలుపుచు వారిని గౌరవించుచుండుట మంత్రికిఁ గంటకముగనుండి, విజయనగర రాజ్యక్షేమ మాసించి, దుదకాతని బంధించి పెనుగొండ దుర్గమునకుఁ బంపించెను. విరోధు లావిషయమును బసిపట్టి బాలరాజును సైతము పరిమార్చిరి.

నరసింహరాజు రెండవసుతుఁడుగూడ నట్టులఁ బెనుగొండలో మరణించుటవలనఁ బ్రజలలో నొకవిధమగు నలజడి వ్యాపించెను. కొందఱు మంత్రియే మరల గుప్తముగఁ జంపించెనను కొనిరి. మఱికొందరు మంత్రియొక్క సుగుణములఁ దలంచియు,

నాతనికి రాజకుటుంబముపై గల విశ్వాసము నెంచియు నట్టి కార్యమున కొడిగట్టఁజాలఁడని నిశ్చయించిరి. ఏది యెట్లున్నను నగరమునఁగొంత సంచలనము బయలుదేరెను. రాజులేని రాజ్య మరాజకమగునని విచారించి, యమాత్యశేఖరుఁడు తోడనే విజయనగరసింహాసన మాక్రమించెను. అతఁడత్యంత శేముషీ మంతుఁడును, ప్రఖ్యాతివహించిన శూరకులభూషణుఁడును నగు టవలన సామంతులుగాని దండనాథులుగాని, యెవ్వరెట్టి యాటంకము గలిగింపఁజాలరైరి. ఉన్నతోద్యోగులెల్ల రాతని యాజ్ఞాబద్ధులై, యెప్పటియటులఁ దమ తమ విధుల నత్యంత భక్తిశ్రద్ధలతో నిర్వర్తింపుచుండిరి.

తుళువ నరసరాజు రాజ్యమాక్రమించినపిమ్మట నాతనికొక ప్రజ్ఞాధురంధరుఁడగు మంత్రి కావలసియుండెను. సమయస్ఫూర్తియు బుద్ధిచాతుర్యముఁగల సచివునకై యాతఁడెంత యత్నించినను దొరకకుండెను. తుదకాతఁడొక యుక్తి పన్నెను. ఒకనాఁడాతడు విశ్వాసపాత్రులగు కొందఱు భటులను బిలిచి "భటులారా! ఇదిగో! ఒకఱాతిపలకపై నేనొక గీటుగీచితిని. దీనినిఁ జెరుపకుండఁ జిన్నదిగఁ జేయఁగల ధీశాలియొక్కరుఁడు గావలయును. అట్టివాని నెచ్చటనైన నెమకి తీసికొనిరండు. కార్య సాఫల్యము నొంది రాఁగలిగితిరేని గొప్ప బహుమతు లందఁగలరు. లేకున్న రాజదండనము తప్ప"దని కఠినముగ నుత్తరవిడి పంపెను. సేవకులకు యజమానుని యనుమతి దాఁటరానిదికదా!

రాజాజ్ఞను బడసి రాజభటులు ఱాతిపలకనుగొని చనిరి. వా రటుల పలుపట్టణములు దిరిగిరి. ఎచ్చటికేగి యెవనికిఁ జూపించినను 'ఇది యేమి? గీతను జెరుపకుండఁ జిన్నది కావించు

టెట్టులు? ఇది యెంతయు వింతగనున్నదే! దీనినిట్లు పంపిన మీ రాజున కేమయినఁ బిచ్చియా' యనుచుండిరే కాని యా పని నెఱవేర్చు బుద్ధిశాలి యొక్కఁడును గనుపింపకుండెను.

వారట్లు చాలప్రదేశములకుఁ బ్రయాణించి చివఱకు పెనుగొండదుర్గమున కేగిరి. అటనొక పాఠశాలవెంబడి వారు పోవుచుండ, నందలివిద్యార్థులు గురువుగారితో 'నెవ్వరో రాజభటులు ఱాతిపలకఁ గొనిపోవుచుండిర'ని చెప్పిరి. అప్పుడు గురు వా వింత యేమో కనుగొందమని వారినిఁ బిలిపించెను. ఆ రాజసేవకు లెన్నోచోటులఁదిరిగి విసివియున్నందున నందెవరేని తమపని నెఱవేర్పఁగలరేమోయని యాశించిపాఠశాలలోని కరిగిరి. ఉపాధ్యాయుఁ డా పలకనుగాంచి 'యేమది? ఈ పలక నిట్లు గొని పోవుచున్నా'రని యడిగెను. అందుల కా సేవకు 'లయ్యా! ఆ గీతను దుడుపకుండఁ జిన్నది చేయఁగలరా'యని యడిగిరి. అది విని గురువున కేమియుఁ దోఁచక మిన్నకుండెను.

అంత విద్యార్థిబృందమునుండి యొక్కఁడు లేచి 'యేదీ? ఆ పలక నిటు తెండ'ని దానినిఁగైకొని, యా గీతప్రక్కనే మఱి యొక పెద్దగీటుగీచి, 'యిప్పుడు మొదటిది చిన్నదైన' దనెను. ఆ బాలుని తెలివితేటల కచ్చటివారెల్ల నబ్బురపడిరి. రాజసేవకులు వెంటనే యా బాలునిఁగైకొని విజయనగరమున కేగిరి. అపుడు వారు పెనుగొండ పాఠశాలలో జరిగిన వృత్తాంత మంతయు తేనికి వినిచిరి. అందులకు నరసరాజు తనకుఁదగిన మంత్రి లభించెనని సంతసించి యాతనికి రాజకీయ జ్ఞానముఁ గలిగింప, నాతఁడసామాన్య మేధానిధియై తిమ్మరుసు మహామంత్రియను పేర లోక విఖ్యాతిఁ గాంచెనందురు.

ఈ కథయందలి సత్యాసత్యము లెట్లున్నను, తిమ్మరుసు బాల్యమున మిక్కిలి బీదవాఁడనియు, మధుకరవృత్తిచేఁ బెనుగొండ, చంద్రగిరి దుర్గములలో విద్య నభ్యసించెననియు, విద్యాభ్యాసము బూర్తియైనపిమ్మట రాజకీయపరిజ్ఞానమునంది కొండఱు దుర్గాధిపతులకడ చిన్నచిన్న రాజకీయోద్యోగములఁ జేసి బుద్ధిబలముచేత నున్నతోద్యోగముల సంపాదించి తుట్టతుదకు విజయనగరసామ్రాజ్యమునకుఁ బ్రధానమంత్రి యయ్యెననియుఁ జరిత్ర ఋజువుపఱచుచున్నది.

నరసరాజేంద్రుఁడు మంత్రి చూడామణియగు తిమ్మరుసు నసాధారణ ప్రతిభాతిశయముచేత శత్రురాజ్యముల జయించి నరసింహరాయల కోరిక నెఱవేర్చెను. ఈ భూపాలుఁడు శౌర్యాగ్రేసరుఁ డగుటయేకాకఁ దన యాస్థానమున నందిమల్లయ, ఘంట సింగయ యను కవీంద్రులఁబోషించి, వాఙ్మయ పోషకుఁడయ్యెను. ఆ కవిద్వయము రచించిన వరాహపురాణ మీ భూపతి కృతి నంది, వారి ననేకరీతుల సత్కరించెను.

నరసరాజునకుఁ దిప్పాంబ, నాగాంబ, ఓబాంబ యను ముగ్గురు భార్యలు కలరు. అందుఁ దిప్పాంబకు వీరనరసింహరాయలు, నాగాంబకుఁ గృష్ణరాయలు, ఓబాంబ కచ్యుతరాయలు జన్మించిరి. ముప్పురుభార్యలందును బుత్రరత్నత్రయము గాంచినందులకు నరసరాజెంతయు సంతసించెను. ఆ రాజకుమారులు క్రమముగ నభివృద్ధి నందుచుండిరి. అందు గుణరూపమనీషాదులయందుఁ గృష్ణరాయలు మిన్నయై యున్నందున రాజాతనియందు మిక్కిలి మక్కువగలిగి యుండెను.

# ౯

అది రాత్రి నాల్గుగడియల ప్రొద్దుపోయినవేళ శుక్లపక్షము. సుధామయ చంద్రిక యెల్లయెడల హాయిగఁ బ్రసరించుచుండెను. రాజవీధులందలి జనులసందడి యింకను దగ్గలేదు. రత్నాల వీధిలో వజ్రవ్యాపార మంతవఱకును జరుగుచుండెను. కుప్పలు కుప్పలువోసిన ముత్యముల రాసులపైఁ జంద్రకాంతి సోకి, వాని కాంతిని ద్విగుణీకృత మొనర్చుచుండెను. రాజాంతఃపురమున నరసరాజు పెద్దభార్యయు, మూఁడవ భార్యయు రాజు కృష్ణ రాయనిపై నెక్కుడు ప్రేమ గలిగియున్నందుల కీర్ష్యవహించి రహస్యముగ మాటాడుకొనుచుండిరి.

'వానియందంత మక్కువ ఎందులకో!'

'ఎందుల కేమిటి? అతఁడు స్ఫురద్రూపియఁట!'

'ఓహో! ఆమాత్రపు రూపురేఖలు మనపిల్లలకు మాత్రము లేవుకాఁబోలు! 'తాను వలచినది రంభ. తాను మునిఁగినది గంగ' యని యిందులకే యనుచుందురు.'

'అంతియకాక వాఁడు మిగుల సూక్ష్మబుద్ధియఁట!'

'అట్టులనా! ఆపాటి బుద్ధిసూక్ష్మత యందఱికిఁ గలదు. వాఁడేమైన దేవలోకమునుండి దిగివచ్చినాఁడా? లేక బృహస్పతి తన బుద్ధిలోఁ గొంచెము తీసి నూరిపోసినాఁడా?'

'ఏమోకాని వాఁడన్న రాజునకు ప్రాణసమాన మక్కా. క్రింద నడచినఁ గందిపోవునని కుందుచుండును.'

'అవునవును పెద్దకుమారుఁడును గనిష్ఠపుత్త్రుఁడును జెట్టునఁ గోసికొని వచ్చినట్లును, మధ్యవాని నొక్కనినే కన్నట్లును వృద్ధ చాలెంచుచుండును. ఎందులకింత పక్షపాతము !'

'ఎన్నియోమారు లీ విషయమునుగూర్చి వారితోఁ జెప్పితిని. జ్యేష్ఠపుత్త్రుఁడుండగ రెండవసుతునం దింతకూరిమి తగ దనియు నొక్కి వక్కాణించితిని.'

'ఏమనినారు ?'

'ఏమున్నదక్కా ! వాఁడసమాన బుద్ధిశాలియఁట ! రాజలక్షణములు వానియందే కలవఁట. భావియందు గొప్పప్రఖ్యాతి నందఁగల సూచనలు వాని ముఖమునం దున్నవఁట. ఇంకేమేమో చెప్పినారు.'

'సరే ! కానిమ్ము. ఆ బుద్ధివిశేషము - రాజలక్షణములు నేవియో చూతేము.'

'చూడక మనమేమి చేయఁగలము ?'

'చేయవలసినదే చేయఁగలము'

'అనఁగా? నాకుఁ దెలియుటలేదు.'

'పిచ్చిదానవు నీకేమి తెలియును ? కృష్ణరాయఁడు బ్రతికియుండఁగ మన బిడ్డలకు రాజ్యము దక్కదు.'

'కాఁబట్టి.....'

'వానినిఁ గడతేర్పవలెను.'

'అమ్మయ్యో ! హత్యయే! బాలవధ పాపముగదక్కా?'

'రాజ్యవిషయమునఁ బాపపుణ్యవిమర్శనమునకుఁ జోటులేదు.'

'ఆ మాటయన్న నాకేదియో భయమగుచున్నదమ్మా'

'భయమెందులకు? నీ వూరక చూచుచుండుము' ఆ పని నేను చేయించెదను.'

'నీ యిష్టము తల్లీ! నేను వెడలిపోయెదను.'

'పొమ్ము ఈ సంగతి యెవ్వరికినిఁ దెలియనీయరాదు.'

అంతట నాగాంబ తన సౌధమున కేగెను. అప్పుడు తిప్పాంబ దాసి యచ్చటి కేతెంచినది. దానినిఁగని తిప్పాంబ 'ఏమే! నీకుఁ జెప్పినకార్య మేమైన దనెను'

'మీయాజ్ఞ కొక యభ్యంతరమున్నదా మహారాణీ! అంతయు సిద్ధపఱచితిని.'

'సరే! వాఁడిప్పు డెచటనున్నాఁడు?'

'మహారాజావారికడ నున్నాఁడు. ఇట్టి రాత్రిసమయముల వానినిఁ దీసికొనివచ్చుటకు సాధ్యపడదమ్మా!'

'ఎందుచేత?'

'ప్రొద్దుగ్రుంకినది మొదలు మహారాజావారు నాగాంబ యంతఃపురముననే యుందురు.'

'కాఁబట్టి — మఱెట్టి యేర్పాటుచేసితివి?'

'రేపుదయము జాముప్రొద్దెక్కినతరువాత మీకుమారులతో నాడుకొను నెపమున నెవ్వరికిఁ దెలియకుండఁ దీసికొనివచ్చెదను. అపుడు మీ పని పూర్తి సేయుఁడు.'

'మంచిది ఎల్లి యెట్లయినను వానినిఁ గైకొనిరమ్ము. నా యత్నమున నేనుందును.'

మఱునాఁడుదయము జాము ప్రొద్దెక్కినవేళఁ దిప్పాంబ యంతఃపురమున నటునిటుఁ దిరుగుచుండెను. ఆమె ప్రతి నిమిష మును దాసికై యెదురు చూచుచుండెను. తాను నియమించిన కృత్యముపట్ల నది యేమైన నేమరుపాటున నుండెనా యని సంకో చించెను. అది తన కత్యంత విశ్వాసపాత్రురాలనియుఁ గొంచె మైన నశ్రద్ధగ నుండదనియు ధైర్యము దెచ్చుకొనెను. ఆమె కేమియుఁదోఁచక ద్వారముచెంతకును లోనికినిఁ దిరుగుచుండెను. అంతలో నామెకు దాసి కనుపించెను. తోడనే యామె 'పనినెఱ వేఱినదా?' యనెను. 'మహారాణీ!మన వ్యూహమున కభ్యంతర మున్నదా?' యనెను ? అవునుగో ! యువరాజావారితో వచ్చు చున్నాఁడని దాసి బదులుపలికెను. అప్పుడు మహారాణి సంతో షమునకు మేరయేలేకుండెను. తనకుమారున కెవఁడు కంటక ప్రాయుఁడై యుండెనో యట్టివాఁడు గడియంగోఁ గడతేరగలఁడని కడుంగడు ముదమందెను. అప్పుడామె పుత్రునితోడ నాడు కొనుచుఁ గృష్ణరాయలు మేడపైకి వచ్చెను.

నాగాంబ యంతఃపురమునకుఁ దిప్పాంబదాసి పలుసారులు వచ్చుచుఁ బోవుచుండుటఁ దిమ్మరుసు ప్రధాని కనుఁగొనెను. మహామేధానిధియగు ప్రధానికిఁ దెలియకుండ విజయనగరమున నే కార్యము జరుగఁగలదు! దాసి రాక కాతఁ డనుమానించెను. ఒక్క నిమేష మాలోచించెను. అందేదో మోసమున్నదని గ్రహించెను. మహారాజ్ఞి యేదైనఁ గుతంత్రముఁ జేయఁ

దలపెట్టినదేమో యని తలపోసెను. తన శరీరమునఁ బ్రాణ వాయువు లున్నంతవఱకుఁ గృష్ణరాయనిఁ గాపాడఁ గృతనిశ్చ యుఁడయ్యెను. తిప్పాంబ పన్నుగడ నిప్పుడే నిర్మూలింతునని తలంచి తిమ్మరుసు వెంటనే యామె సౌధమున కేగెను.

తిమ్మరుసు తిప్పాంబ భవనమున కేగునప్పటికి వీరనరసింహునకు, కృష్ణరాయనికిఁ జెరియొక పాయసపాత్ర యచటఁ బెట్టఁబడి యుండెను. ఆ బాలురిద్ద ఱా పాయసముఁ ద్రావఁ బోవుచుండిరి. తిమ్మరుసుమంత్రి వెంటనే 'త్రాగవద్దని' పెద్దగఁ గేకవైచెను. ఆ బాలు రిరువు రది విని యాశ్చర్య చకితులైరి. కృష్ణరాయలకడనున్న పాయసపాత్రఁ జేతఁబట్టుకొని తిమ్మరుసు 'అమ్మా! మహారాజ్ఞీ! బాలుర కిప్పుడకారణముగఁ బరమాన్న మిడుచుంటివేల' యని యడిగెను.

'పిల్లల కల్పాహారముగఁ బరమాన్నమిడుచుంటిని. దానికిఁ గారణమేముండును మహామంత్రీ!'

'ఓహో! అట్టులనా! ఏదీ? ఆ రెండవపాత్ర నిటు తెమ్ము. (తీసికొని) ఏమమ్మా! ఈ రెండు నొకేవిధముగు వర్ణముగ లేవేమి?'

"ఏమో నాకేమి తెలియును? ఒక పాత్రలో సిద్ధపఱచినదే చెరికొంచె మొసఁగితిని'

'అట్లయినఁ బాత్రలమార్చి, బాలురకిచ్చి త్రావింతమా?'

ఆ మాటవినఁగనే రాణికి నోటమాట వెడలలేదు. తల పిడుగుపడినట్లయ్యెను. ఒడలు కంపమొందెను. సూటిగ నడిగిన

యీ ప్రశ్నకామె బదులు చెప్పలేక పోయెను. తన రహస్యము మంత్రి గ్రహించినాఁడని యెంచి క్రిందఁజూచుచు నూరకుండెను.

'మహారాజ్ఞీ! నిజము వచింపుము. ఇందు విసముఁ గలుప లేదా?'

'మంత్రిమహాశయా! తప్పిదము జరిగినది.'

'ఎందుల కింతటి ద్రోహబుద్ధి? ఇట్టి గృహకల్లోలము సెలఁగినఁ బ్రజలేమనుకొందురు? రాజ్యమెట్టి యధోగతి పాలగును? శత్రువుల కిది చులకన కాదా?'

'పుత్రవ్యామోహమునఁ గావించిన పొరపాటు పోక్కనీయ కుఁడు. క్షమింపుఁడు.'

'పుత్రప్రేమ కెవ్వరును గాదనరు. బాలహత్య యెంతటి ప్రమాదకారణమగునో భావించవలదా?'

'మహామంత్రీ! నన్నీతప్పిదమునుండి కాపాడుము.'

'సరే! జరిగినదేదియో జరిగిపోయినది. మును ముం దిట్టి చెట్ట పుట్టకుండఁ జూచుభారము మీది. ఇప్పటి కిది ప్రథమ దురాగత మైనందున సైరించెదను. తండ్రి మరణానంతరము రాజ్యము వీరనరసింహరాయనికే రాగలదని నమ్మి విశ్రాంతిగ నుండు' డని పలికి కృష్ణరాయనిఁ గైకొని తిమ్మరుసు మహామంత్రిశేఖరుఁ డట నుండి రాజమందిరమున కేగెను.

---

తన ప్రయత్న మట్లు నిష్ప్రయోజనమై నందులకుఁ గృష్ణ రాయని సవతితల్లి యెంతయు దురపిల్లెను. తిమ్మరుసుమంత్రి దూరదృష్టిముం దిఁకఁ గృష్ణరాయని మడియించు యత్నము కొనసాగదని నిరాశఁజెందెను. తన పుత్రునకు రాజ్యము దక్కదే మోనని చాలభయపడెను. విధివిధానముఁ దప్పింప నెవరితరము కాదుగదా యని యొక్క నిట్టూర్పువుచ్చి యూరకుండెను.

అట్లుండఁ గొన్ని దినములకు నరసరాజు మృతినందెను. రాజవంశానుచార మాతని పెద్దభార్య కుమారుఁడు వీరనరసింహ రాయలును, దిమ్మరుసు మున్నగువారలు రాజునుగావించిరి. కృష్ణరాయలు యువరాజై యుండెను. ఏ లోటులేకుండ రాజ్య పాలనము ప్రశాంతముగ జరిగిపోవుచుండెను.

పుష్పరాజము పుట్టువొందఁగనే దాని మనోహరపరిమళము వ్యాపించును. రత్న మెచ్చటనున్నను రాణించుచునేయుండును. అట్టుల గృష్ణరాయలు బాల్యమునుండియు మేధావంతుఁడనియు సుగుణశీలియనియుఁ బేరుపొందెను. సంస్కృతాంధ్రభాషల యందు జక్కని పాండిత్య మలవరచుకొనెను. కృష్ణరాయనికి యుక్తవయసు వచ్చుసరికి శౌర్య సాహసములం దసమానుఁడయి రణవిద్యా నైపుణ్య మందియుండెను. ఆతఁడు సేవకులయందు దయయు, మిత్రులందు వాత్సల్యము, పౌరులయం దాదరముఁ గలిగి యుండి సకలసద్గుణరాశి యని నగరవాసులచేఁ బొగడఁబడుచు

మిక్కిలి వాసిఁగాంచి యుండెను. వేయేల? కృష్ణరాయలనినఁ బ్రజలెల్లరు గాఢముగఁ బ్రేమించుచుండిరి.

కృష్ణరాయని జనరంజకత్వమును, సద్గుణములును, సాహసోపేతకార్యములను గని వీరనరసింహరాయలు పెల్లువగచుచుండెను. తన యనంతరము తనపుత్రుడగు తిమ్మరాజును కృష్ణరాయలు రాజ్యమునకు రానీయఁడని యాందోళన మొందుచుండెను. తమ్ముని సాహసోదారగుణముల ముందు తనతనయుఁ డెంతయని యాతఁడు బెంగఁగొనెను. ఆ సంశయాగ్ని యనవరత మాతని హృదయము దహింపుచుండెను. ఏవిధముగనైనఁ దమ్ముని దెగటార్చినఁ గాని రాజ్యవిషయమున నిశ్చింతగ నుండఁజాలనని తలంచెను. మాయోపాయముననే యాతని మడియింపఁ గృతనిశ్చయుఁడయ్యెను.

అంతలో వీరనరసింహున కవసానసమయ మాసన్నమయ్యెను. తన యభీష్టము నెఱవేఱనందులకు మనమునం దాతఁడు మిగులఁ గుమిలిపోవుచు నొకనాఁడు తిమ్మరుసును జేరఁబిల్చి యిట్లనెను. "మంత్రిశేఖరా! మా తండ్రికాలమునుండియు మాకు మంత్రిసత్తముఁడవుగ నుండి విశ్వాసపాత్రుఁడవైతివి. నాయందుఁ గూడ నట్టి భక్తి విశ్వాసములతోడనే వర్తింపుచుంటివి. మంత్రిలోకమున నీకుఁగల ప్రజ్ఞాబల మనల్పము. నీ మహామేధాశక్తివలన మమ్ముల నింతవఱకుఁ గంటికి ఱెప్పవలెఁ గాపాడుచుంటివి. ఇపుడు నాకొక యభిమతముకలదు. దానిని నెఱవేర్చితివేని హాయిగఁ బ్రాణములఁ బాసెదను. ఆ వాంఛిత మీడేర్ప నీవే సమర్థుఁడవు. అదెట్టిదనఁ గృష్ణరాయ లఖండ ప్రజ్ఞావంతుఁడు. రాజకీయయోచనాధురంధరుఁడు. విశేషించి ప్రజాదరణమునకుఁ బాత్రుఁడు.

అట్టివాఁడు నాయనంతరము నా సుతునకు రాజ్యము దక్కనీయఁడు. ఈ యనుమానము పెనుభూతమువలె నను బాధించు చున్నది. నీవు స్వామిభక్తిపరాయణుఁడవు. నే నొనర్చు మనిన కార్యముఁ జేయ నిరాకరింపవు. నాయందుఁగల విశ్వాసము బురస్కరించుకొని కృష్ణరాయల కనులఁ దీయించి నాకుఁ జూపుము. యిదియ నా తుదికోరిక."

తిమ్మరుసుమంత్రి యీ మాటలాలకించి 'ఔరా! రాజెట్టి దారుణకృత్యముఁ దలపెట్టినాఁడు! ఈ తలంపు సముచితమైనది కాదని చెప్పిన నిప్పుడీతఁడు వినఁడు. మంచిచెడ్డల విమర్శించు యోచనసైత మీతని కీ పట్టున లేదు. 'తాఁబట్టిన కుందేటికి మూఁడుకాళ్ళే' యను పట్టుబట్టియున్నాఁడు. నాకెంతటి స్వామి భక్తి యున్నను జిన్నతనమునుండియు నాపదలఁ దప్పించి ప్రాణ తుల్యముగఁ గాపాడుచున్న కృష్ణరాయనిఁ దుదముట్టింపలేను. దీనికొక్కటే మార్గముగలదు. ఇప్పటి కట్టులేయని సమ్మతించి, యుపాయాంతరమునఁ గృష్ణరాయలఁ గాపాడెద' నని మనము నందుఁ దీర్మానించుకొనెను.

అట్లాలోచనాపరుఁడై యున్న మంత్రి సత్తముని గని వీరనర సింహుఁ 'డే మాలోచించుచుంటివి? నిరుత్తరం బంగీకార సూచకమా' యని పలికెను. 'చిత్త మట్లే కావించెద'నని చెప్పి తిమ్మరుసు సెలవుగైకొని చనెను. తనయాజ్ఞను దలఁదాల్చి, తత్కార్య నిర్వాహణమునకై తిమ్మరుసుమంత్రి యేగెనని రాజు స్వస్థచిత్తుఁడై యుండెను.

తిమ్మరుసు కృష్ణరాయని నొక రహస్యమందిరమున దాచి యుంచి, తాను మఱలఁ జెప్పునంతవఱకు గుప్తముగ నందుండ వలసినదని యాతనికి యావద్వృత్తాంతము వినిచి చనెను. తరు వాతఁ దిమ్మరుసు మేఁకనొకదానిని దెప్పించి, దాని కనులఁ దీయించి, రాజుకడ కేగి, 'యయ్యా! ఇవిగో! కృష్ణరాయని కను' లని చూపించెను. వీరనరసింహరాయ లా కనులఁగాంచి సంత సించెను. కొంతకాలమున కాతఁ డసువులఁ బాసెను.

కృష్ణరాయని కెన్ని యాపదలు వచ్చినను వాని నన్నిఁటెనిఁ దన నిశితబుద్ధిచేఁ దప్పించి, తిమ్మరుసుమంత్రి యాతనినిఁ బుత్ర ప్రేమమునఁ జూచుచుండెను. రాయలునకుఁ గల సకలకళా సామర్థ్యమునుగని తిమ్మరుసు, విజయనగర చక్రవర్తులలో నగ్రగణ్యుఁడై యఖండ తేజోమండితుఁడై, విశేష విఖ్యాతి నార్జింపఁగలఁడని యాశింపుచుండెను. కృష్ణరాయలు తన ప్రాణ దాతయగు తిమ్మరుసు మంత్రివర్యునిఁ బితృవాత్సల్యమున "అప్పాజీ" యని పిల్చుచుండెను.

తన యన్న మరణానంతరము తిమ్మరుసు సాయమునఁ గృష్ణరాయలు క్రీ. శ. 1509 సంవత్సరమున మహావైభవోపేత ముగ, సర్వాలక్షణ సంశోభితముగ విజయనగర రాజ్యరమారమణీ కరగ్రహణ మొనరించెను. ఆ సమయమున నార్వీటి బుక్క రాజును, పరాక్రమోపేతులై ప్రాకట కీర్తి నందిన నొకువారును, కంటకు లైన రాజుల గర్వమడంచి మించిన నంద్యాలవారును, నిరాఘాట మైన పరాక్రమధాటిగల వెల్గోటివారును, చండతర శౌర్యసం పన్నులైన పెమ్మసానివారును మొదలైన భూపతులు తన్నుఁ

బరివేష్టించియుండ శ్రీకృష్ణరాయమహాళి పట్టాభిషిక్తుఁడై పురమేగఁ బయలుదేఱెను.

ఆ యుత్సవ మెంతయుఁ గన్నులపండువుగ నుండెను. ఒక మదకరీంద్రముపై నవరత్న కాంతులతో విరాజిల్లు సింహాసనమున శ్రీకృష్ణరాజేంద్రుఁడు కూర్చుండియుండెను. ఆయన కిరుపార్శ్వముల నిశితకృపాణధారులగు వీరభటులు హయములపై నెక్కి వచ్చుచుండిరి. వారికి ముందుభాగమున సకల సామంత దండనాథాది ప్రముఖు లేతెంచుచుండిరి. రాయలకు సమీపముననే గజారూఢుఁడై తిమ్మరుసు మంత్రిశేఖరుఁ డరుదెంచుచుండెను. ముందుభాగమున మనోహరములగు వివిధ మంగళవాద్యములు మ్రోయుచుండెను.

అట్లు శ్రీకృష్ణరాజచంద్రుఁడు పురమేగుచుండ సౌధోపరిభాగములనుండి సతీమతల్లులు పుష్పవృష్టి గురియించుచుండిరి. కొందరుసుందరాంగులు సుగంధభరితమైనపన్నీరు జిలుకుచుండిరి. ప్రజానురంజకుఁడగు ప్రభువరేణ్యుఁ డూరేగుచుండఁ బౌరు లానందమగ్నులై జయజయధ్వానములు సల్పుచుండిరి. అట్టి లపూర్వవైభవమున రాయలు నగరోత్సవముఁ గావించుకొని రాజసౌధమున కేతెంచెను. ఆ సమయమునఁ గవిపండితులకు సత్కారములు జరిగెను. వీరవరేణ్యులకుఁ బారితోషికము లొసంగఁబడెను. పేదసాదలకు నూతనవస్త్రము లీయఁబడెను. ఆ దినమంతయు జనసమూహముల కన్నదానము సేయఁబడెను.

---

# ౧౧

చాలకాలమునుండియుఁ దగిన భూనాథుఁడు లభింపక, వరింప కుండిన విజయనగర రాజ్యేందిర సకల సద్గుణ సేవధియైన శ్రీకృష్ణ రాయని వరించి ధన్యయయ్యెను. రామరాజ్యమువలెఁ బాలింపఁ గల రాజవరేణ్యుఁడు తమకుఁ బ్రాప్తించినందునఁ బ్రజలెల్ల రా నృపాలమౌళిని దైవసమానముగఁ దలంచుచుండిరి. ప్రజ్ఞావంతుఁ డును బాహుబలోపేతుఁడు నగు కృష్ణరాయ నరేంద్రునకు, బంగరునకుఁ బరిమళమబ్బినట్లు మంత్రికులమండనుండగు తిమ్మ రుసు ప్రధానియై యుండెను. విజయనగరరాజ్యలక్ష్మి యాచరిం చిన బహువ్రతముల ఫలమో యన్నట్లు లా రాజ మంత్రు లా రాజ్యమును బాలింపుచుండఁ బ్రజాహృదయమునందు నూతనా నందము రేకెత్తెను.

తాను రాజ్యాభిషిక్తుడగునప్పటికి దుర్బలస్థితియం దుండిన రాజ్యమును రాయలు రెండు వత్సరములవరకుఁ గట్టుదిట్ట ములు చేసెను. తొలుదొల్త దుర్గమును శత్రువులకభేద్యమగు నట్టులు బునర్నిర్మాణముఁ జేయించెను. బురుజులను బూర్వము కన్న మిన్నగ దిట్టపఱచి, బలమైన కాపుదల పెట్టెను. రాజ్యమును విస్తారముఁ గావింపనెంచి శ్రీకృష్ణరాయలు సైన్యమును వృద్ధి పఱచెను. సమయము వచ్చినపుడు యుద్ధమొనరించుటకు దాదాపు పదిలక్షల వీరభటులను సంసిద్ధపరచెను. కవచధారణము గల్గిన పెక్కుగుఱ్ఱపుదళములను, తండోపతండములగు వేదండము లను, ప్రళయకాల రుద్రులవంటి దండనాథులను గూర్చికొనెను.

అత్యవసరసమయములం దాహవభూమికి రప్పింపఁగల మఱి యిరువది లక్షల సైన్యములనుగూడ నాతఁడు సిద్ధపఱచియుండెను.

ఇట్లు యుద్ధసన్నాహములఁ గావించుకొని శ్రీకృష్ణరాయలొక శుభసమయమున దక్షిణదిగ్విజయ యాత్రకు దండు వెడలెను. ప్రప్రథమమున రాయలు శివసముద్ర దుర్గమును ముట్టడించెను. ఆ కాలమున నయ్యది బలాఢ్యమైన దుర్గము. కర్ణాటక దేశమునఁ గావేరీతీరమునం దా దుర్గముండెను. గంగరాజను నతఁడు దానినిఁ బాలింపుచుండెను. శివసముద్ర దుర్గము తొలుత విజయనగర సామ్రాజ్యమునకు లోఁబడియుండెను. శ్రీకృష్ణరాయలు పట్టాభిషిక్తుఁడగునప్పటి కా దుర్గపాలకుఁడగు గంగరాజు స్వతంత్రుఁడై కప్పముఁగట్టకుండెను. అందువలన రాయలు మొదట వాని గర్వమడంపఁ జతురంగబలసమేతముగ బయలుదేఱెను.

ఆ సమయమున శ్రీరంగపుర పరిపాలకుఁడగు చిక్కరాజునకును, గంగరాజునకును మిక్కుటమగు వైర ముండెను. మాటిమాటికి వా రొండొరులు గలహించుచుండిరి. నయధురీణుఁడగు శ్రీకృష్ణరాయ లా విషయమును గ్రహించి, చిక్కరాజును బ్రోత్సహించి, యాతనిసైతము యుద్ధమునకుఁ గొంపోయెను.

అట్లపార సేనాసమేతుఁడై ముట్టడించిన రాయల శక్తి సామర్థ్యముల నెఱుంగలేక గంగరాజు గర్వాంధుఁడై తన యల్పసైన్యములతో రాయల సైన్యముల నెదుర్కొనెను. సంగరభూమిని శక్తియున్నంతవఱ కాతఁడు పోరాడెను. కాని సక్రమ శిక్షణము

నొంది సాహసోపేతముగ సమర మొనరించు, రాయల సైన్యముల ధాటి కాగలేక గంగరాజు సైన్యమంతయు గంగపాలయ్యెను. తానెంత యత్నించినను జయము కలుగనందులకు గంగరాజు పరితపించి పరాభవము భరింపలేకఁ గావేరీ గంగలోఁబడి ప్రాణములఁ గోల్పోయెను. తన బలమును బగతుర బలమును బరికింపక యుద్ధమొనరించుట సూర్యుని వెలుగునందలి దివ్వెవిధమున నిష్ప్రయోజనమగును గదా! తరువాత శివసముద్ర దుర్గమును శ్రీకృష్ణరాయలు స్వాధీన పఱచుకొనెను.

పిమ్మట రాయలు "ఉమ్మటూరు" కోటను, గర్ణాటక మైసూరు దేశములను జయించెను. ఆ విజయ చిహ్నముగ నటఁ గృష్ణరాయధ్వజ మనుపేర నొక విజయ ధ్వజము స్థాపించెను. తాను గెలుపొందిన ప్రదేశములకు శ్రీరంగపట్టణము రాజధాని గావించి, యా పురాధీశుఁడగు చిక్కరాజును రాయలు తన ప్రతినిధిగ నిల్పెను. అటనుండి కదలి శ్రీకృష్ణదేవరాయలు, పూర్వము తమకు సామంతులుగనుండి గంగరాజుతోఁబాటు కప్పమీయకున్న కొడగు మళయాళ దేశముల రాజుల నోడించెను. అటు తరువాతఁబాండ్యాది దక్షిణ రాజ్యముల జయించు తలంపున రాయలు విజయప్ప వెంకటప్ప నాయకులకుఁ గొంత సైన్య మొసఁగి పంపెను. ఆ వీరద్వయము వీరభటనికాయము లతోఁ బయనించి, పాండ్య చోళ మండలములలో నున్న పాలెగాండ్రను, జింజీదుర్గమును, మధుర తంజాపురాది రాజులను గెల్చి, వారినెల్ల సామంత రాజులుగ నుండునట్లొడంబఱచి, ఆ విజయ వృత్తాంతమును రాయలునకు నివేదించిరి.

ఉద్దండులైన తన దండనాథు లట్లు విజయసంపదలతో నిండిన దండయాత్రలఁ గావించుకొని వచ్చినందులకు రాయ లానందపర వశుఁడై వారిని బహుభంగుల సన్మానించెను. ఆ జైత్రయాత్ర వలన సామంతరాజుల నుండి దాదాపు మూఁడుకోట్లరూప్యములు రాయల కేటేట వచ్చుచుండెను. అట్లు జయించిన దక్షిణ భూభాగమునంతయు మూఁడు మండలములుగ విభజించి, యా రాజచంద్రుఁడు మువ్వురు ప్రతినిధులను నియమించెను. అటుల విజయలక్ష్మి సంశోభితుఁడై శ్రీకృష్ణరాజేంద్రుఁడు ప్రథమ జైత్రయాత్రను ముగించుకొని యతి వైభవముతో విజయనగర మున కేతెంచెను.

తరువాతఁ గొంతకాలము రాయలు విశ్రాంతిఁ గైకొనెను. దక్షిణ దిగ్విజయయాత్రలో మేటి పరాక్రమధాటి జూపించిన వీరవరేణ్యులకు రాయలు మంచి పసవనము లిచ్చెను. విజయనగర సామ్రాజ్యమునుండి విడిపోయిన రాజ్యభాగముల నన్నింటిని మరల జయించితీరవలయునని యా నృపాలవరాళి నిశ్చయించెను. సేనాసమూహముల నుత్సాహపూరితముగ నొనరించెను. పదపడి పూర్వ దిగ్విజయ యాత్రకై బయలుదేఱ సన్నద్ధుఁడయ్యెను.

ఆ కాలమున నెల్లూరుమండలమున నుదయగిరి యను బలీయ మైన దుర్గమొకటుండెను. మొదట నా కోట విజయనగరసామ్రా జ్యములోనిది. కృష్ణరాయలు పరిపాలనమునకు వచ్చునాఁటి కయ్యది కటకపురి గజపతుల స్వాధీనమందుండెను. అప్పుడు కటకపురి నుండి నెల్లూరువఱకుఁగల నాంధ్ర భూభాగమంతయుఁ బ్రతాపరుద్ర గజపతిచేఁ బాలింపఁబడుచుండెను. ఆ గజపతి

ఉదయగిరి దుర్గమునకు వీరభద్రపాత్రునిఁ బాలకునిగ నియమించెను. వీరభద్రపాత్రుఁ డత్యంత పరాక్రమశాలి. పర్వతమధ్యమున నుండి శత్రుజనాభేద్యమైన యుదయగిరిదుర్గము నతఁడు మివుల శక్తియుక్తులతోఁ బాలించుచుండెను.

అట్టి దుర్గమును జయింపఁ గోదమసింగములవంటి సైనికులతోడను, మిక్కిలి యుక్కుమీఱిన గజాశ్వదళములతోడను రాయలు బయలుదేఱెను. దుర్గము దరిజేరుట కొక చిన్న కొండత్రోవ తప్ప వేఱొండుమార్గము లేకుండెను. అట్టిమార్గము నరికట్టినఁ గోటలోనివారికిఁ దినుబండారము లందకుండునని తలఁచి రాయలట్లు గావించెను. అట్లు పదునెనిమిదిమాసములు ముట్టడించిన నా కోట స్వాధీనముఁ గాకుండెను. చివఱకు పర్వతములఁ బగులఁగొట్టించి రాయలు విశాలమగు మార్గముఁ గావింపజేసెను. ఆ మార్గముగుండ రాయలసైన్యములు దుర్గమునందు ప్రవేశించెను.

కోటలోపలి పదాతిదళ మల్పమైనను మిక్కిలి ధైర్యసాహసములతోఁ బోరఁగడంగెను. కాని యప్రతిమాన శౌర్యమున విజృంభించు రాయల సైనికులముందు వారు నిలువలేకపోయిరి. కొంతవడి కాదుర్గము రాయల వశమయ్యెను. అందు దుర్గాధిపతి పినతండ్రియగు ప్రహారేశ్వరపాత్రుఁడును, దుర్గాధ్యక్షుని మేనత్తయుఁ జెఱపట్టఁబడిరి. వీరభద్రపాత్రుని మేనత్తనుమాత్ర మతి గౌరవముతోఁజూచి రాయ లామెను వదలిపెట్టెను. ప్రహారేశ్వరునిఁ జెఱపట్టి విజయనగరమున కంపెను. ఆ తరువాత నెల్లూరు మండలమునకు రాజైన వీరరుద్ర గజపతిని జయించి, శ్రీకృష్ణదేవరాయలు గజపతి కూతురైన చిన్నాదేవి సౌందర్యాతిశయ

కూతురైన చిన్నాదేవి సౌందర్యాతిశయమున కానందించి, యామెకుఁ దానామెను వివాహమాడుదునని తెలియఁజేసెను. ఆ సుందరియుఁ గృష్ణరాయల వరించుట కిష్టపడెను. అప్పుడు రాయలు చిన్నాదేవిని విధివిధానముగ వివాహమాడెను.

ఉదయగిరిని స్వాధీనపఱచుకొనిన పిదప రాయలు కొండవీడును జయింప నిశ్చయించెను. ఈ దుర్గము నేఁడు శిథిలమై యున్నది. అయినను బూర్వపు దాని నిర్మాణచాతుర్యమును, గొండకోసలనుండి కోటగోడల నిర్మించిన ప్రతిభయు నేఁటికిఁ గన్నులపండువుగనే యుండును. పరరాజగిరిదుర్గ వైభవములఁ గ్రిందుపఱచినదనియుఁ, బరిపంథి రాజన్యబలముల బంధించిన దనియు మొదలుగాఁగల వర్ణనలతో శ్రీనాథుఁడు కొండవీడు దుర్గము నానాఁడు గొండాడినాఁడు.

కాకతీయసామ్రాజ్య మస్తమించినపిమ్మట నచ్చటి రెడ్డి సరదారు లా కోటను నిర్మించిరి. స్వదేశాభిమానమున, సనాతన ధర్మానుసరణి రెడ్డిరాజేంద్రులు భాషాపోషకులై వైభవశ్రీలు వెలుఁగొందఁ గొండవీటి రాజ్యమున నూరేండ్లకాలముఁ బాలించిరి. రెడ్డినృపాలుర పేర్వడిన దొడ్డకీర్తి మఱపురానిది! తరువాత కటకపురాధిపతియగు కపిలేంద్ర గజపతి రెడ్డిరాజుల నోడించి యా దుర్గమును లోఁబఱచుకొనెను. మన కథాకాలమునాఁటికిఁ గొండవీడు గజపతుల సంతతివాఁడైన వీరభద్రగజపతి పాలనము నందుండెను. ఆ యెడ గజపతి కండగనుండి నరహరిదేవుఁడు, శ్రీనాథరాజు మొదలుగాఁగల పెక్కుయోధవరులు కొండవీడును బరిపంథులు గన్నెత్తియైనఁ జూడకుండఁ గాపాడుచుండి.

అట్టి బలాఢ్యమైన కొండవీడు దుర్గమును జయించుటకు శ్రీకృష్ణదేవరాయలు తిమ్మరుసుమంత్రితో నాలోచించెను. ఆ రాజమంత్రులిద్వరు నాదుర్గమును జయించుట కొక గొప్ప వ్యూహమును బన్నిరి. అంతట నొకనాఁడు రాయలు కొండ వీడును ముట్టడింప నపరిమిత సేనాసమూహముతో బయలు దేఱెను. ఆ మహావాహిని కంతటికిఁ దిమ్మరుసుమంత్రి యధి పతియై యుండెను.

ఉదయగిరిని నిర్జించి, కొండవీడును ముట్టడింప నఖండ సేనా పరివృతుఁడై రాయ లేతెంచుట కటకపురీశ్వరుఁడగు ప్రతాపరుద్ర గజపతికిఁ దెలియవచ్చెను. తోడనే యాతఁడు కొండవీటఁ దన సుతునకు సాయపడుటకు మేటిశూరులైన యైదులక్షల కాల్బల ములను, నిరువదివేల యాశ్వికులను, బదుమూఁడునూరుల యేనుఁగులను దీసికొని బయలువెడలి కృష్ణరాయలతోఁబోరాడఁ గృష్ణయొడ్డున వేచియుండెను. ఈ వార్త నెఱిఁగి రాయలు కొండ వీటి ముట్టడినాపి, ప్రతాపరుద్ర గజపతినిఁ దోల్త జయింప సైన్య ములతోఁగదలి కృష్ణానది దక్షిణతీరమున కేతెంచెను.

ఇట్టులఁ గృష్ణానది కుభయతటముల భయదమై పోడఁగట్టు విశేష సేనాసమూహము విడిసియుండెను. కాని మునుముం దెవ్వరును గృష్ణదాఁటి రాకుండిరి. అంతట రాయలు కొంత తడవు వేచియుండి తన వాహినితోఁ గృష్ణావాహిని దాఁటి గజ పతి సైన్యముల దాకెను. అప్పు డిరుకెలంకులవారికి పోరు ఘోర ముగ జరిగెను. ఉభయపక్షములవారును ప్రతాపమున విజృంభించి రణమొనరించిరి. కాని రాయల వీరభటకోటిధాటి కాఁగలేక గజ

పతి సైనికులు వెఱచి, వికావికలై పరువువాఱిరి. గజపతి పలాయితుఁడయ్యెను. విజయలక్ష్మీరమణి రాయల వరించెను. గజపతిసైన్యమునఁగల గజములు, హయములు, ధనము మున్నగునవి కొల్లగా రాయల వశమయ్యెను.

ఆగతిఁ బ్రతాపరుద్రగజపతినిఁ బలాయితునిఁ గావించి రాయలు కొండవీడును ముట్టడింప సేనాపతులకు ముదలనిడెను. తిమ్మరుసుమహామంత్రి కొండవీడును జయింపఁ గొంతసైన్యమును గైకొని చనెను. కొండవీటి కోటలోనున్న వీరభద్ర గజపతి స్వల్ప సంఖ్యాకములైన తన సైన్యములతోడనే రాయల బలముల మాఱ్కొనెను. ఆ యుద్ధమునఁ గొండవీటి దుర్గాధిపతికి శ్రీనాథరాజు మున్నగువారు తమతమ సైన్యములతో సాయపడిరి. మిక్కిలి ధైర్యసాహసములతో మొక్కవోని శౌర్యమున వీరభద్రగజపతి రాయల సేనలతోఁ బోరెను. అట్లు ఉభయ బలములకు రెండుమాసములు ప్రచండమైన భండనము జరిగెను. తిమ్మరుసు యుద్ధవ్యూహమునకును, రాయల సైనికుల శౌర్యాగ్నికినిఁ దట్టుకొనలేక కొండవీటిసేనలు లొంగిపోయెను. వెంటనే దుర్గము తిమ్మరుసు స్వాధీనమయ్యెను. అపుడు తిమ్మరుసు మంత్రివర్యుఁడు తన మేనల్లుఁడగు నాదెండ్ల గోపనమంత్రిని కొండవీటి దుర్గపాలకునిగా నియమించి, యా విజయవార్త రాయల కెఱింగించెను.

పదపడి శ్రీకృష్ణదేవరాయలు కొండవీటికిఁ బరిసరముల నుండు బెల్లముకొండ, నాగార్జునకొండ, అద్దంకి మొదలగు దుర్గములను దనవశముగావించుకొనెను. ఆ దండయాత్రలో రాయలు

తనధర్మపత్నులతోడను, ఆస్థాన కవీంద్రులతోడను వచ్చియుండెను. కవిపుంగవులు రాయల జైత్రయాత్రను మనోహర కావ్యరూపముల నభివర్ణించుచుండిరి.

కొండవీటినుండి, దైవభక్తితత్పరుఁడగు శ్రీకృష్ణరాజేంద్రుడు భార్యాసహితుఁడై యమరావతికేగి, యమరేశ్వర స్వామినిఁ బూజించి బీదల కనేకదానము లొసంగెను. అటనుండి విజయవాడ, శ్రీకాకుళక్షేత్రముల సందర్శించెను. రాయలు తన "ఆముక్తమాల్యద" మహాకావ్యమును శ్రీకాకుళ క్షేత్రమున రచింప మొదలిడెను.

తరువాత రాయలు గజపతుల స్వాధీనమందున్న కొండపల్లి దుర్గమును జయింప బయలుదేఱెను. కొండపల్లిని రెండునెలలు ముట్టడించి దానిని జయించెను. ఈ ముట్టడిలోఁ బ్రతాపరుద్రగజపతి భార్యాపుత్రాదులు రాయలకు బందీలైరి. పరాంగనాసోదరుఁడగు శ్రీకృష్ణరాయలు గజపతిభార్యను మాతృభావమునఁ బూజించి, యామెభర్తకడకుఁ బంపించెను. శత్రురాజులు సైత మట్టి రాయల యౌదార్యమును బలుతెఱఁగులఁ బ్రస్తుతించిరి.

రాయలున కింక నా దండయాత్రలోఁ గటకపురి యవశిష్టముగ నుండెను. దానినిఁగూడ జయించినఁగాని తన దిగ్విజయయాత్ర సంపూర్తి కానేరదని రాయలు తలపోసెను. కృష్ణాగోదావరీ నదులమధ్యనుండు వేఁగిదేశముపై దండెత్తి రాయలు బయలుదేఱెను. మార్గమధ్యమునఁ గోనసీమ, రాజమహేంద్రవరము మున్నగు ప్రదేశములఁ లోఁబఱచుకొనెను. పిమ్మట

రాయలు భీకరారణ్యముల భేదించుకొనిపోయి బహుకేంద్ర వంశజులకు రాజధానియైన పొట్నూరు జయించి, యట నొక విజయస్తంభము నాటించెను. అటనుండి సింహాచల క్షేత్రమును సందర్శించి, యచ్చటఁగూడ జయసూచకమగు డంబుమీఱు నొక కంబము నెలకొల్పెను.

కడకు కృష్ణరాయలు సకలబలసంయుతుఁడై కటకపురీ నికటమున కేతెంచెను. ఆవార్త విని గజపతి సామంతులు, బలభద్రపాత్రుఁడు మొదలగు పదునాఱుమంది పాత్రులు తమ సైన్యములతో వచ్చి రాయలబలములఁ దాఁకిరి. అప్పుడిరువైపుల వారికి దారుణసంగ్రామము జరిగెను. ఆయుద్ధమున బహురణాంగణముల జయమంది బడలియున్న రాయలసైనికులు వెనుకాడఁ జొచ్చిరి. కృష్ణరాయ లా విపత్కరపరిస్థితిఁ దిలకించి భయమంది తిమ్మరుసుతో మంతనము సలిపెను.

అపుడా మహామంత్రి తన బుద్ధిబలము నుపయోగించి, యత్యద్భుతమగు నొక పన్నుగడ బన్నెను. తోడనే పదునాఱు పేటికలఁ దెప్పించి, వానియందు ధనకనకరత్నములనుంచి, పదునార్గురు పాత్రరాజులపేర వారు ధనమాశించి గజపతి కెగ్గుదలంచు నట్లు భావమువచ్చు లేఖలఁబెట్టి భటులచేఁ గటకపురి వీధులగుండ వానినిఁబంపించెను. గజపతి సైనికు లాభటులను బట్టితెచ్చి తేని సముఖమునఁ బెట్టిరి. నా జా పెట్టెలఁదీయించి పరీక్షించి దన కపకారమెంచి రాయలతో సంధిచేసికొనుటకు పాత్రరాజులెంచినారని తలంచి యుద్ధము తానొక్కరుఁడు చేసి ఫలములేదని తత్కార్య విముఖుఁడైయుండెను. మఱునాడు పాత్రులు యుద్ధసన్నద్ధులై

వచ్చి, గజపతిసైన్యము లేకుండుట కాశ్చర్యపడి, యందేదియో మోసమున్నదని వచ్చినత్రోవం జనిరి. అంతట రాయలు ససైన్యుండై చనికటకపురములోంబ్రవేశించెను. గజపతి రాయలకు స్వాగతమిచ్చి, తన కుమార్తె యగు నన్నపూర్ణాదేవి నొసంగి వివాహమొనరించెను. రాయలు మరలం గటకపురమున గజపతినే రాజుగ నిల్పి తిమ్మరుసుమంత్రిమణి బుద్ధి విశేషమున కంజలించి, పూర్వదిగ్విజయయాత్ర బరిసమాప్తిం గావించుకొని నిజనగరమున కేతెంచెను.

౧౨

శ్రీకృష్ణదేవరాయలు పూర్వదిగ్విజయయాత్రను విజయోపేతముఁ గావించుకొని విజయనగరమున కేతెంచిన పదపడి నొక్కమొయి నాల్గు సంవత్సరముల వఱకే యుద్ధములు లేక రాజ్యపాలనముఁ గావించెను. ఆ సమయముననే కవితా గోష్ఠులతోఁ గాలక్షేపము సేసెను. అష్టదిగ్గజములనఁబడు అల్లసాని పెద్దన, నంది తిమ్మన, ధూర్జటి, పింగళి సూరన, రామకృష్ణుఁడు, రామరాజ భూషణుఁడు, అయ్యలరాజు రామభద్రుఁడు, మాదయగారి మల్లన యను కవీంద్రుల నాస్థానమున నుంచుకొని, రాయలు వారిచే నుత్తమోత్తమ కావ్యములు రచింపఁజేసెను. అందుఁ గొన్ని కావ్యములను దాను కృతినందెను. అష్టదిగ్గజములలో నత్యంత కీర్తిఁగాంచిన పెద్దనకవీంద్రుని మనుచరిత్రము కృతినందుకొనువేళఁ గృష్ణరాయలు స్వయముగ నా కవివర్యుని పల్లకిఁ దన కేలనెత్తెను. ఆ కవీంద్రున కాంధ్రకవితాపితామహుఁడను బిరుదమొసఁగి గండపెండేరము తానే తొడఁగెను. తక్కిన కవిశేఖరులనుగూడఁ బెక్కు రీతుల రాయలు సన్మానించెను. తన యాముక్తమాల్యద నీ కాలముననే యాయన పూర్తి గావించెను. నేటికిని ఆముక్తమాల్యద ఆంధ్రకావ్యప్రపంచమున నగ్రగణ్యమై యొప్పుచున్నది.

కేవలము కవితాగోష్ఠియందే కాలముగడుపక శిల్పము, చిత్రలేఖనము మున్నగువానిని సర్వతోముఖముగ నభివృద్ధిపఱచుటకు రాయ లెంతయు కృషిసల్పెను. అంతియకాక క్రొత్త రీతుల

యుద్ధసాధనములఁ బెంపొందఁ జేసెను. సామ్రాజ్యమునందలి దుర్గములనెల్ల మిక్కిలి గట్టిపఱపించెను. పోర్చుగీసువారిచేఁ బిలిపించి తుపాకులను, మరఫిరంగులను సిద్ధముచేయించెను. రాయలీ విధమున సాహిత్యాభివృద్ధితోడ సామ్రాజ్యాభివృద్ధి ప్రయత్నములుసైతము సలుపుచుండెను.

ఆ కాలమునఁ గృష్ణా తుంగభద్రానదుల మధ్య రాయచూరను నొక దుర్గము గలదు. అప్పుడది యాదిల్షా యనువాని పాలనలో నుండెను. పూర్వమది విజయనగర సామ్రాజ్యములోనిదే! దానినిఁగూడఁ గైకొనినఁగాని సామ్రాజ్యాభివృద్ధి కార్యక్రమములు సఫలముకావని రాయ లెంచెను. కాని యాదిలాషాయలునకు మిక్కిలి స్నేహపాత్రుఁడై యుండెను. అందువలనఁ గారణములేక గయ్యమున కేఁగుట రాయలునకు రుచింపదయ్యెను. కదనము సేయఁదలఁచినవానికిఁ గారణమునకు గొదువ యగునా?

ఇట్లుండ "సయ్యద్ మార్కొన్" అను మహమ్మదీయుఁ డొక్కరుఁడు రాయలుకడ కేతెంచి గుఱ్ఱముల గొనివత్తునని వచించి విశేషధనముఁ గొనిచనెను. అతఁడా ధనమపహరించి యాదిల్షా రాజ్యమున దాగియుండెను. ఆ సంగతి చారుల వలన రాయ లెఱింగి 'వానినిఁ బట్టి యీయవలసినదని' యాదిల్షాకు వార్తనంపెను. ఆదిల్షా యందుల కీయకొనక మిన్నకుండెను. ఆ కతమున రాయలు రాయచూరుపై దాడిసలుప బయలుదేఱెను.

ఆ దండయాత్రకై రాయలంతకు ముందుగనే యఖండ సేనాతండములు సిద్ధపఱచెను. నిష్కళంక ప్రభుభక్తిపరాయణు

లగు దండనాథులెల్ల యుద్ధమునకు సంసిద్ధులైరి. కొంతకాలము నుండి విశ్రాంతిఁ గైకొనుచున్న సేనాసమూహమునకు మరల సమరోత్సాహము మెండయ్యెను. సామ్రాజ్యమునందలి సామంత రాజులంద ఱాయాజికిఁ బయనమైరి. అంతట మహాసంరంభమున రాయలసేన రణోత్సాహ మతిశయింప నడచుచుండెను. అట్టి సేనాపరివారమును పోర్చుగీసు చరిత్రకారుఁడు "న్యూనీజ్" ప్రత్యక్షముగా వీక్షించి విభ్రమమొంది తానెన్నఁడు నంతటి చతురంగబలసమేతమైన సేనాసమూహమును గనివిని యుండలేదని యద్భుతముగా వర్ణించినాఁడు.

కృష్ణరాయల దండయాత్ర నెఱింగి మండిపడి యాదిల్షా గొప్పసైన్యములతోఁ గృష్ణానది దాఁటివచ్చి రాయల బలములతోఁ దలపడెను. తెనుఁగుగడ్డపైఁ దురుష్కులఁ గాలూన నీయరాదను పౌరుషమున నాంధ్రవీరులు విజృంభించి వీరవిహార మొనరించుచుండిరి. తెల్గుజోదుల తీవ్రపరాక్రమమున కాగలేక మహమ్మదీయ భటులు పాఱిపోఁజొచ్చిరి. తన కపజయము గలుగుట తథ్యమనియెంచి యాదిల్షా యొక మదగజముపైనెక్కి కృష్ణదాఁటి రాయచూరు చేరెను.

అంతటఁ గృష్ణరాయలు సైతము సర్వసైన్యములతోఁ గృష్ణను దాఁటించి రాయచూరు ముట్టడించెను. తన్ను వెన్నంటియే వచ్చుచున్న రాయల బలము నెదిరింప యాదిల్షా సత్వరమే తన సేనలను సమకూర్చుకొని సమరభూమి కరిగెను. అప్పట్టున రాయలసైన్యము లాదిల్షా సైనికులతోఁ దలపడెను. ఆ రణరంగమున నాంధ్రసైనికులు నూతనోత్సాహమున మిక్కిలి పట్టు

దలతోఁ జెక్కుచెదరని పౌరుషముసూపి పోరాడసాగిరి. తురుష్కసైనికులు సామర్థ్యమున్నంతవఱకుఁ బోరిరి. కాని యదివరకెన్నఁడట్టి పౌరుషాతిరేకము ప్రకటింపక పోరొనరించుచున్న యాంధ్రవీరుల శౌర్యమునకు వారు లొంగిపోయిరి. దుర్గము రాయలునకుఁ జిక్కెను. అట్టి మహావిజయమునుబొంది రాయలు విజయనగరమున కేతెంచి రణభూమిని మొక్కవోని శౌర్యసాహసములఁ బ్రదర్శించిన యోధవీరుల కనేక బహుమతులను, మేటిబిరుదములను నొసంగెను. సామంతరాజేంద్రుల నందఱను దగురీతుల గౌరవించెను.

రాయలు రాయచూరును జయించిన వార్త హిందూదేశమం దెల్లెడ వ్యాపించెను. ఆనాఁటినుండి యీ రాజేంద్రునియశము మరింత వన్నెకెక్కెను. పరిపంథుల కీ నృపాలవరాళి దివ్యనామము సింహస్వప్నమయ్యెను. ఉత్తరదేశమునఁగల మహమ్మదీయ రాజులందరును కృష్ణరాయని పరాక్రమస్ఫూర్తికి వెఱచి యాతనితో మైత్రి బాటించియుండిరి.

ఆదిల్షా తానోడిపోయినపిదపఁ గొన్ని దినములకుఁ దన పరాజయ పరిస్థితి వివరించి, తప్పుమన్నించి, మరల రాజ్యమొసంగుఁడని యొక దూతచేఁ గృష్ణరాయలునకు విజ్ఞాపనపంపెను. సహజముగ నుదారహృదయుఁడగు రాయలు 'ఆతఁడు దనకడకు వచ్చి వేఁడుకొన్న నట్లే యాతని రాజ్య మిచ్చెద' నని యా దూతచే మరల వార్త బంపెను. ఆదిల్షా యందులకు సమ్మతించి విజాపుర రాజ్యమందలి ముద్గల్లు వద్ద రాయలు తనను గలిసికొనినచో తప్పు నొప్పుకొందునని మఱియొక వార్త బంపెను. ఆతని

ప్రార్థన మంగీకరించి నియమితకాలమునకు రాయలు సైన్యసమేతుఁడై యచటికేగ నాదిల్షా రాకుండెను. అందులకా మహారాజు కోపించి యది విజాపురరాజుల కుతంత్రమని తలంచి యాపురమును ముట్టడించెను. మిక్కిలి శ్రమలేకయే విజాపురమును జయించెను. అందంతకుఁ బూర్వము బంధింపబడియున్న బహామనీరాజుల విడిపించి, వారిలో నొక్కనికిఁ గలబరగి రాజ్యము నిచ్చి, తక్కినవారినిఁ దన రాజధానికి దోడుకొనిపోయి తగిన యుద్యోగములనిచ్చెను. అక్కతమున రాయలునకు ''యవన రాజ్యస్థాపనాచార్య'' యను బిరుదు లభించెను.

రాజ్యమునకు వచ్చినది మొద లపజయమనునది యెఱుంగక విజయశ్రీల నొందిన యసమాన పరాక్రమశాలియైన శ్రీకృష్ణ రాయ చక్రవర్తికి రాజపరమేశ్వర, శ్రీమన్మహారాజాధిరాజ, మూరురాయరగండ, అరిరాయ విభాళ మొదలగు శత్రురాజ భయంకరములగు బిరుదము లెన్నియో లభించెను. అట్టి జగదేక వీరుఁడగు నా సార్వభౌముని పాలనమునఁ బ్రజలు, కవులు నాదిగాఁగల వారందఱు ధన్యులైరి. ఆ యశస్వి పరిపాలనమున నాంధ్రరాజ్యలక్ష్మిలలామ మూఁడు పూవు లాఱు కాయలుగ రాజిల్లెను.

కృష్ణరాయ సార్వభౌముఁడు, గీర్వాణాంధ్రములం దసమాన పాండిత్యము గలవాఁడు. పండిత కవీంద్రుఁడై యుండుటచే నీ మహారాజు రసవత్తరమగు కావ్యరాజమును సృష్టించెను. అష్ట దిగ్గజ కవీంద్రులను బోషించి మహాప్రబంధములు రచింపఁజేసెను. ఇంకను సంస్కృతాంధ్ర కర్ణాటక కవివరేణ్యుల నెందఱినో గౌర

సించి బహూకరించెను. ముఖ్యముగ రాయ లాంధ్రభాషా పోషకుఁడై యాంధ్రభోజుఁడని పేరందినాఁడు. 'దేశ భాషలం దుఁ దెనుఁగులెస్స' యని కృష్ణరాయలు తెనుఁగుబాస యందలి తన ప్రేమమును వెల్లడించెను.

ఆ నృపాల తిలకుఁడు సాహిత్య సేవయం దెంతటి యాదరాభి మానములు గలవాఁడో శిల్పకళయం దంతటి మక్కువ కలవాఁడు. విజయయాత్రలలో నున్నపుడుగూడ నీ రాజచంద్రుఁడు శిల్ప కళారాధన మేమఱలేదు. దూరదేశములనుండి సైతము కళాకోవి దులను బిలిపించి విజయనగరమున విఠలస్వామి యాలయము, హజారరామస్వామి యాలయము మొదలగు పెక్కుకట్టడములఁ గట్టించెను. చక్కని చెక్కడపుఁ బనులతోఁ బంపావతీ దేవాల యమునకు గొప్ప గోపురముఁ గట్టించెను. కళానిలయముగ నుగ్రనరసింహస్వామి విగ్రహమును జెక్కించెను. వేయేల! రాయలు విజయనగరమున లెక్కకుమిక్కిలియగు పెక్కు సుందర మందిరములు, సభాభవనములు మున్నగువాని నెన్నిటినో నిర్మింపించి, యా నగరము ననన్యసామాన్య కళాఖండముగఁ దీర్చి దిద్దించెను.

చిత్రలేఖనమునందుఁగూడ రాయ లత్యంత శ్రద్ధవహించెను. పెక్కుదేశములనుండి గొప్ప చిత్రకారులను రప్పించి, యేటేటఁ జిత్రకళాప్రదర్శనములఁ గావింపుచు సమర్థులగువారి చిత్రము లకుఁ జక్కని పారితోషికము లిచ్చుచుండెను. ఈ చక్రవర్తి వ్యవసాయాభివృద్ధి కనేక సదుపాయములు కల్పించెను. తుంగ భద్రానది కానకట్టఁ గట్టించి, కాల్వలద్వారా నీటినిఁ బాఱించి

సస్యానుకూలముఁ గావించెను. వ్యాపారవిషయమున నీ భూకాంతుఁడు ప్రత్యేక శ్రద్ధవహించెను. సముద్రమార్గమున విరివిగ విదేశవ్యాపార మొనరింపఁజేసెను. వర్తకమువలన నేఁటేఁటఁ గోటానుకోటుల ధన మీ రాజేంద్రుని ధనాగారమునఁ జేకుచుండెను. విజయనగర విపణివీధులలో విచ్చలవిడిగ ముత్యములు కుప్పలుగఁ బోసి యమ్ముచుండెడివారు. ఆనాఁడు శ్రీకృష్ణరాయల పాలనమున విజయనగరము సర్వ కళాసంశోభితమై యొప్పుచుండి, వర్తక వ్యాపారములతో విరాజిల్లుచుండి, సమస్తసంపదల కాలవాలమై యుండెను.

రాయలునకు ముఱ్ఱురుభార్యలు. వారియం దిర్వురు పుత్రికలు నొక పుత్రుఁడును జన్మించిరి. ఆ మహారాజు తన జ్యేష్ఠపుత్రిక నార్వీటివంశ సంజాతుఁడగు రామరాయలునకును, రెండవ కుమార్తె నాతని సోదరుఁడగు తిరుమలరాయలునకు నొసంగి మహేంద్రవైభవమున వివాహములు గావించెను. పిమ్మట రాయలు తనపుత్రున కాఱేండ్లువయస్సురాఁగానే రాజ్యాభిషిక్తునిఁ గావించి, వాని కండదండగా నుండెను. ఇట్లుండ గొంతకాలమున కా బాలుఁడు గతించెను. తిమ్మరుసుపుత్రుఁడు తన కొమరునిఁ జంపించెనని రాయల కనుమానము గలిగెను. అందువలన నాతఁడు తిమ్మరుసునను, నాతని సుతునిఁ జెఱసాలయందుంచెను. ఉపాయాంతరమునఁదిమ్మరుసుతనయుఁ డెట్లో చెఱఁ దప్పించుకొని, కొలఁదికాలమునకుఁ గొంతసైన్యముఁ గూర్చుకొని వచ్చి రాయలుపై దండెత్తెను. మహాసముద్రమును దోడిపోయుట

కెత్తిన యేతమువలె నాతని జతనము నిరర్థకమైపోవుటయే గాక క్రమ్మర నాతనికిఁగారాగార వాస ప్రాప్తియుఁ గలిగెను.

తరువాతఁ గొంతకాలమునకుఁ దండ్రికొడుకుల విచారించి, తనపై ద్రోహమెంచినారను తలంపున రాయలు వారిరువురకుఁ గనులు దీయించెనఁట. ఆహా! కాలమహిమ!! చిన్నతనమున నుండియుఁ దన్ను బెంచి పెద్దవానినిఁజేసి, పెక్కుడుమలనుండి కాపాడి, తుదకొక సామ్రాజ్యనాథునిఁగావించి, "యప్పాజి" యని పిలిపించుకొన్న తిమ్మరుసు మహామంత్రియెడఁ గృష్ణ రాయలంతటి దారుణకార్య మేల చేసెనో విస్పష్టముగఁ దెలియ రాకున్నది. కృష్ణరాయల పవిత్ర చరిత్రయం దట్టి కళంక మేల యాపాదింపఁబడెనో యథార్థ చరిత్ర మింకను దెలియకున్నది. పాపము! తిమ్మరుసు కనులు దీసినపిమ్మట, కారాగారవాసము ననే కొంతకాలము జీవించి, యందే తుద కసువులఁ బాసెను.

అవలఁ గొన్ని యంతఃకలహములు సామ్రాజ్యమున సంభ వించెను. వాని నన్నిఁటిని రాయ లవలీలగ నణఁచివైచెను. కృష్ణ రాయలు చక్కని యాకారము గలవాఁడు. ఆ రూపమునకుఁ దోడు గాంభీర్యము, దానికిఁ దోడు శౌర్యసాహసాది సద్గుణము లా రాజకులైక భూషణునకు మఱింత వన్నె దెచ్చినవి.

విదేశీయులు సైతము వింతపడునట్లు రాజ్యపాలనముఁగావించి, యపజయమనునది కలనైన నెఱుంగక అనేక విజయయాత్రలు సలిపి, పలు తెలుంగుల సామ్రాజ్య మభివృద్ధిపఱచి లలితకళా పోషకుఁడై, విశేషించి యాంధ్ర కవితాకుమారికి నూత్నాలం

కృతులఁగూర్చి, సకలదిగంతములఁ దన కీర్తిచంద్రికలఁ బర్వఁజేసి, ప్రపంచ ప్రఖ్యాతినందిన యాంధ్ర సార్వభౌముఁడు 'శ్రీకృష్ణరాయలు క్రీ. శ. 1530 లో దివిజసామ్రాజ్యనాథుని గుండియ దిగ్గురనఁగ దివం బలంకరించెను. ఆ మహనీయుని చరిత్ర యాంధ్ర దేశమునకే కాక యావద్భారతభూమికిఁ బరమపావనమైనది. రాయ లనంతర మాతని సవతితల్లి కొడుకగు అచ్యుత దేవరాయలు రాజ్యమునకు వచ్చెను.



# ౧౩

కృష్ణరాయలు రాజ్య మేలినంతకాలము మహమ్మదీయరాజు లెవ్వరును దలయెత్తలేదు. వారి రాజ్యభాగములు చాలవఱకు రాయలచే జయింపఁబడి విజయనగర సామ్రాజ్యమున లీనమై పోయెను. ఆవీరాధివీరుఁడు దివికేగిన పిమ్మటఁ దురుష్కరాజులు మరల స్వాతంత్రింపసాగిరి. చాలకాలము క్రిందట స్థాపింపబడిన బహమనీరాజ్యము శక్తిహీనులగువారి పాలనకులోనై భిన్నభిన్నములై పోయెను. అట్లు చెదరిపోయిన రాజ్యము తుదకు విజాపుర రాజ్యము, గోల్కొండరాజ్యము, అహమ్మద్ నగర రాజ్యము, బీదరురాజ్య మను నాల్గురాజ్యములుగ నయ్యెను. ఆ మ్లేచ్ఛ రాజ్య చతుష్టయమున నెల్లప్పుడు వారిలో వారికి యుద్ధములు జరుగుచుండెను. అట్లు వారు కలహించుకొనుచు నొకరి రాజ్యమొక రాక్రమింపుచు, నప్పుడప్పుడు విజయనగరరాజుల సాయమపేక్షించుచుండిరి.

కృష్ణరాయని బాహుబలమున సంపాదింపఁబడిన సామ్రాజ్యమున కచ్యుత దేవరాయ లత్యంత వైభవమునఁ బట్టాభిషిక్తుఁడై తన సుతుఁడగు చినవెంకటాద్రిని యువరాజు గావించెను. అచ్యుతదేవరాయల సమయమున విజయనగర సామంతుఁడగు కేరళదేశపురాజు తిరుగుబాటు జేసెను. అప్పుడచ్యుతదేవరాయలు సకలము తిమ్మయ యనువాని నాతని లోఁగొనఁ బంపెను. శౌర్యవంతుఁడగు తిమ్మయ సైన్యసమేతుఁడై యేగి, కేరళాధిపతి నోడించెను. కేరళాధ్యక్షుఁడు క్షమింపుఁడని తిమ్మయను బ్రార్థించెను.

వాని యభ్యర్థనము మన్నించి తిమ్మయ్య, మరలనాతఁడు సామంతుఁడుగ నుండునట్లేర్పఱచిఁ వానినే రాజుగ నుంచి వచ్చెనఁట.

అచ్యుతదేవరాయలు సమస్త రాజభోగము లనుభవించుచుండ సకలము తిమ్మయ్యయే సకల రాజకార్యములు చక్కఁబఱచుచుండెను. అట్లుండఁ గొలఁది కాలమునకే యచ్యుతరాయలు మరణించెను. అప్పుడు తిమ్మయ్యయే మొత్తము రాజ్యపుఁ బెత్తనము వహింపనెంచి యుండెను. కృష్ణరాయని యల్లుఁడగు రామరాయలు తిమ్మయచేతలకు సహింపఁజాలక రాజవంశీయులకే రాజ్యము సంక్రమింపఁజేయ నిశ్చయించి యుండెను. అట్లెంచి రామరాజు కొంతసైన్యము గూర్చికొని తిమ్మయ్యను వధించి, యచ్యుతరాయల తమ్ముని కొడుకగు సదాశివరాయలును రాజును గావించి, కర్ణాటక రాజ్యస్థాపనాచార్యుఁడని బిరుదు నందెను.

పేరునకు మాత్రము సదాశివరాయలు ఱేఁడుగ నుండెనే కాని, పాలనాధికార మంతయు రాజకీయధురీణుఁడగు రామరాయలకే చెందియుండెను. అప్పటినుండియు విజయనగర రాజ్యరమాసుందరి యార్వేటివంశ నరేంద్రుల వరించినది. రామరాయల పూర్వులెల్లరును శౌర్యధనులు. సుక్షత్రియ సంజాతులు. రామరాజు పాలనమున మరల విజయనగరము తొల్లిటి కళాకాంతులతోఁ గళకళ లాడుచుండెను.

ఆ కాలమున విజాపురి నవాబునకును, అహమ్మద్ నగర రాజునకును బద్ధవిరోధ ముండెను. రామరాజు జీ సమయమును వ్యర్థపోనీయక అహమ్మదు నగరాధిపతి నొక సైన్యము, గోల్కొం

డనవాబు నింకొకవంకను, దన తమ్ముఁడగు వెంకటాద్రి నొక చక్కని విజాపురముపై దండెత్తునట్లు గావించెను. ఆ త్రిముఖ దండయాత్రకు విజాపురాధిపతియగు నాదిల్‌షా తట్టుకొనలేక సంధిజేసికొని, వెనుకటి వారి రాజ్యభాగములు వారి కిచ్చునట్లొప్పు కొనెను. ఆ విధముగఁ బూర్వపు తన సామ్రాజ్య భాగములను రామరాయలు స్వాధీనపఱచు కొనెను.

తురుష్క రాజ్యముల నుండి భయోద్రేకులై పాఱివచ్చిన మహమ్మదీయ శరణార్థులకు రామరాయ లభయమొసంగి వారికిఁ దగువసతి కల్పించుచుండెను. అట్టివారికి విజయనగరమున నొక ప్రత్యేకవీధి నేర్పాటుచేసి రామరాజు వారి కొక మసీదు గూడఁ గట్టించెను. ఒకప్పుడు గోల్కొండ నవాబు తమ్ముఁ డన్న తన్ను జంపునని భయమంది రామరాయల నాశ్రయించె నఁట. ఆ రాజేంద్రుఁ డాతని కొక జాగీరిడి రాజగౌరవముతోఁ జూచెనఁట. దీనివలన రామరాయల మతసామరస్యము స్పష్ట మగుచున్నది.

రామరాయలుతో నహమ్మద్‌నగర రాజగు నిజాంషాహా ఎక్కుడుస్నేహముఁ బాటించుచుండెను. అప్పుడప్పుడాతఁడు రామ రాయలునకు సఖ్యపూర్వకముగ నమూల్యములగు బహుమతు లంపుచుండెడివాఁడు. అది యాదిల్‌షాకు గంటకముగ నుండెను. ఆ కారణమున నాతఁడు రామరాయలునం దీర్ష్యాళువై తన కొలు వున నొకనాఁడు విజయనగరపు రాయబారుల నవమాన పఱ చెను. ఆ వృత్తాంతము రామరాయలునకుఁ దెలియవచ్చెను. ఆ నృపాలున కది యగౌరవముగనుండె, తమ్ములగు తిరుమల, వెంక

టాద్రిరాయలను గొప్ప సైన్యమొసఁగి, యాదిల్‌షా పాలనక్రింద నున్న రాయచూరుపై దండయాత్రకుఁ బంపెను. తమ్ములకుఁ దోడుగ తానుగూడ మఱికొంతసైన్యమును గైకొని రామరాయలు రాయచూరుపై కేగెను. ఆ యుద్ధమున రామరాయలాదిల్‌షా నోడించి తన చిన్నకుమారుఁడగు చినతిమ్మరాజు నందు ప్రతినిధిగ నిల్పి వెడలిపోయెను.

పదపడి కొంతకాలమున కాదిల్‌షా మరణించెను. అప్పుడాతని సుతుఁడగు ఆలీయాదిల్‌షా రాజయ్యెను. అతఁడు రామరాజుతో స్నేహమొనరించి, తన తండ్రి పాలనమున శత్రు హస్తగతములైన రాజ్యభాగముల మరల సంపాదింప సమకట్టి, సమయమున కెదురుచూచుచుండెను. అట్లుండ రామరాయల పుత్రులందొకఁడు కాలధర్మ మొందెను. అదియ యదనని యాలీయాదిల్‌షా రామరాజు నూరడింపఁబోయి గొప్పకానుక లొసంగెను. రామరాయ లాతని నుచితరీతిని గౌరవించెను. అప్పటినుండియు వారిర్వురకు మంచి మైత్రి కుదిరెను. అంతియకాక వారలొండొరులు తండ్రికొడుకులవలె మెలఁగఁజొచ్చిరి.

విజాపుర నవాబు విజయనగరమునుండి వెళ్ళిన తరువాత తమ పూర్వదుర్గముల స్వాధీన పఱచవలెనని నిజాంశాహాను వార్త నంపెను. ఆ వర్తమానముఁ దెచ్చినదూతను నిజాంశాహా యశ్లీలములాడి మిగుల నగౌరవపఱచి పంపెను. అంత నాలీయాదిల్షా కుపితుఁడై రామరాయల సహాయమున నిజాంశాహాపై దండెత్తెను. ఆ దండయాత్రలో నహమ్మదునగరములోనుగాఁగల పలుపట్టణములు బోడయ్యెను. హిందూసైనికులు విచ్చల

పడి విహరించి కొన్ని యధర్మ కార్యము లొనరించిరి. రామ రాయ లందులకు మిన్నకుండెను. అయ్యదియే విజయనగర రాజ్య వినాశనమునకుఁ బ్రథమ హేతువయ్యెను. కృష్ణరాయ లట్లుగాకఁ దాను జయించిన తురుష్క రాజధానులలోఁ దన భటులు తురుష్కులకెట్టి దుష్కృత్యము లొనరింపకుండఁ గట్టడ జేసెను. అందులకనియే సర్వధర్మస్వరూపుఁడగు కృష్ణరాయల పాలనలో విజయనగర సామ్రాజ్యమును వైరులు కన్నెత్తి చూచుటకు సైతము జంకిరి. ఆ రణమున నిజాంశాహా గెలువఁజాలక విజాపుర రాజునకుఁ గల్యాణదుర్గ మొసఁగి సంధికావించుకొనెను.

నిజాంశాహా యాతనికిఁ గల్యాణదుర్గ మిచ్చెనే కాని సమయము వచ్చినప్పుడు కిచ్చెసాధింపఁ బొంచి యుండెను. వెంటనే యాతఁడు గోల్కొండ నవాబుతో స్నేహమొనరించి వానితోఁ గలిసి విజాపురముపై యుద్ధమొనరింపఁ బయలుదేఱెను. ఆలీ యా విషయమును రామరాయలునకుఁ దెలియఁజేసెను. 'ఇంతలోనే నిజాంశాహా మరల యుద్ధమునకు సిద్ధమయ్యెనా' యని రామరాజాగ్రహించి, ప్రచండ చమూ సమూహముతో నాలికి దండగా నరిగి, పరిపంథిగణములఁ బాఱఁదోలెను. అంతటితో నూరకుండక రామరాజు పలాయితులగు శత్రువుల వెన్నఁటిపోయి యహమ్మదు నగరమును ముట్టడించెను. అప్పుడు నిజాంశాహా భయమొంది రామరాజును శరణువేఁడెను. దయాళుఁడైన రామరాయలు వానిని మన్నించి, మరల వాని రాజ్యమును వాని కిచ్చివేసెను.

ఈవిధముగ రామరాజు తురుష్కులపై దండయాత్ర లన్ని నల్లేరుపై బండివలె నేగుచు, వారి యనైక్యము మూలమున

జయపరంపర లందుచు "నింకఁ దనకేమిలెక్క" యని మీసము దువ్వుచుండెను. అట్లాతఁడు నిర్లక్ష్యభావమున నిరంకుశముగఁ జరింపుచు మహమ్మదీయ రాయబారుల నొకవిధముగఁ జులకనగఁ జూడఁ గడంగెను. నానాఁట నవాబుల కది యసహన భావము రేకెత్తించుచుండెను. ఎంతటి ప్రతిభావంతుఁడైన, నెట్టి రాజకీయ ప్రజ్ఞాధురీణుఁడైనను రామరాజు మహమ్మదీయుల యసంతృప్తి గమనింపలేకుండుటవలననే విజయనగర రాజ్య వినాశమునకుఁ గారణభూతుఁడయ్యెను. మహమ్మదీయరాజుల రోషాగ్ని లోలోనఁ గుమిలి కుమిలి గుప్పున రగులొకొనఁ బోవుచుండెను.

తమ రాయబారుల నమర్యాదపఱచుటయు, దమ్ము లక్ష్యింపకుండుటయు, హిందూసైనికులు యుద్ధసమయములందుఁ దమపట్ల మిక్కిలి దుండగము లొనరించుటయు సుల్తానులకుఁ గడుంగడు క్రోధకారణము లయ్యెను. అందు ముఖ్యముగ నాలీ యాదిల్‌షాయే ముందునకువచ్చి తమకు జరుగుచున్న యవమానములను సహింపలేక తనతోడి తురుష్కరాజులఁ బురికొల్ప సాగెను. ఆతఁడు మ్లేచ్ఛరాజ్య చతుష్టయమునఁ బర్యటించి "మనలో మన కైకమత్యము లేకపోవుటవలన విజయనగరాధీశుఁడు మితిమీఱియున్నాఁడు. మన మానప్రాణములకు భంగకరములగు కృత్యములుసైత మాతనిభటులు కావింపుచున్నారు. అట్టియెడ మనమందఱ మొక్కటై యుక్కుమీఱి హిందూ రాజ్యమును నొకటి వ్రేళ్ళతోఁ బెకలించివేయవలయు" నని ప్రబోధముఁ గావించెను.

మహమ్మదీయరాజులు నలువురు విజాపురరాజు హితబోధ వలన నొకరితో నొకరు సంబంధబాంధవ్యము లొనరించుకొనిరి.

ఆ నల్వురస్నేహము దృఢతమమైయుండి చక్కని సంఘీభావము నకు దారితీసెను. సమయము దొరకినపుడు నల్వురేకమై విజయ నగర రాజ్యమును గబళింప సంసిద్ధులైయుండిరి. మహమ్మదీయ రాజు లొకరితో నొకరు వివాహాది సంబంధములు గావించు కొనుటయు, యుద్ధసన్నాహములు గావించుకొనుటయు రామ రాజు చూచి చూడనట్లూరకుండెను. ఆలీ యాదిల్‌షాకుమాత్ర 'మా వృత్తాంత మే' మని లేఖబంప నాతఁడు "మీకేమియుఁ గీడుదలంపను. అవసర మగుచో నేను మీ పక్ష మవలంబింతు" నని ప్రత్యుత్తరమంపెను. ఆ బూటకపు వార్తను నమ్మి రామ రాజు నిశ్చింతగ మెలఁగుచుండెను.

తురుష్కరాజుల యుద్ధప్రయత్నములు సమాప్తమయ్యెను. కారణములేక కయ్యమున కేగుట కియ్యకొనక వారు యుద్ధ హేతువేర్పఱుప నాదిల్‌షానే నియోగించిరి. అప్పు డాదిల్‌షా రామరాజునకు "మీరింతకుపూర్వము వశపఱచుకొనిన మా మహమ్మదీయ రాజ్యభాగములు మా కొసంగుఁడు. కానిచోఁ గార్యము చెడు"నని యొక వార్తాహరునివలన సందేశమంపెను. అందులకు రామరాజు "ఔరా! ఆదిల్‌షా యెంతలో నెంతటి ద్రోహియయ్యె"నని పలికి దూతను దిట్టి పంపివేసెను. ఆ కత మున నా నల్వురనవాబులును తమతమ సేనాసమూహములతో విజయనగరపు ముట్టడికి దక్షిణాభిముఖముగ బయలుదేఱిరి.

వారట్లు పయనించి తాళికోట దుర్గసమీపమున దండువిడిసిరి. అది యాదిల్‌షా రాజ్యభాగ మగుటఁజేసి, యవనసేనాసమూహ మంతయు నాతని యాదరాభిమానములందుచు, యుద్ధవ్యూహ

ములఁ బన్నికొనుచు నుండెను. సమయ మరసి వారు కృష్ణానది రేవులను దాఁటి విజయనగరముపైఁ బడ నుంకించు చుండిరి. హిందూసైన్య సంచలనములను దెలిసి కొనుటకు యవనరాజులు వేగులవారినిఁ బంపుచుండిరి.

రామరాజునకుఁ దురుష్కులు దాడివెడలి వచ్చిన సమాచారము తెలిసెను. అంతట నాతఁడు వేవేగ యుద్ధసన్నాహములు గావించి, సామ్రాజ్యమునందన్నిభాగముల నుండియు సైన్యముల రావించెను. సైన్యమునంతటిని మూఁడుభాగములు గావించి యొకభాగము తన తమ్ముఁడగు తిరుమలరాయని కొసఁగి 'శత్రువులు కృష్ణఁ దరింపకుండునట్లు రేవు లన్నిటినిఁ గాపాడుచుండు' మని పంపెను. వానికిఁ దోడుగనుండ రెండవ తమ్ముఁడగు వెంకటాద్రికి రెండవసైన్య భాగమిచ్చి పంపించెను. మిగిలిన సైన్య సమూహమును తన వెంట నిడికొని రామరాజు వృద్ధవయస్కుఁడయ్యు యుద్ధమొనరింపఁ జనెను.

యవనుల వేగులవారు పరీక్షించిపోయి, 'కృష్ణానది రేవు లన్నియు శత్రుసైన్యములచే సురక్షితముగ నున్న'వని తమ రాజులకుఁ దెలిపిరి. అట్టియెడ మహమ్మదీయులకుఁ గృష్ణదాఁటుట దుర్లభమయ్యెను. తుదకు వారొక యుక్తి పన్నిరి. తమ సైన్యములతో నొకవైపునకుఁ బోవుచున్నట్లు వారు నటించిరి. విజయనగర సైన్యములు వారి ననుసరించెను. తోడనే తురుష్కుల సైన్యములు మఱియొక వైపున కేగి హిందూసైన్యములు వచ్చులోపల నదిని దాఁటెను.

ఈ గతిఁ గృష్ణదాఁటిన యవనసేనావారము మఱునాఁడు యుద్ధమునకుఁ దారసిల్లెను. అది క్రీ. శ. 1565 సంవత్సరము జనవరి

యిరువది మూఁడవతేది. అదియే తాళికోటమహాయుద్ధము. ఔరా! ఆ రణ మెంత దుష్టమైనదో కాని దానితో నాంధ్ర సామ్రాజ్యము నమసిపోయెను. ఆంధ్ర నాయకత్వ మడుగంటెను. వేయేల! ఆంధ్రవైభవ మంతయు నంతరించి పోయెను.

తాళికోట యుద్ధప్రారంభమునఁ దురుష్క సైనికులు దక్షిణ ముఖముగ నుండిరి. వాని కెదురుగ విజయనగర సైన్యము లుండెను. యవనవాహినియందు నల్వురు నవాబులు యోధులై రణరంగము నడుపుచుండిరి. విజయనగర సేనాపారమునఁ ద్రిమూర్తులవలె రామరాయ సోదరులు నాయకులై యుండిరి. యవన సేనామధ్యభాగమున గొప్ప ఫిరంగు లమర్పఁబడెను. వాని కెదురుగ విదేశపు విలుకాండ్రు నిలువ బెట్టఁబడి యుండిరి. ఆ విషయము రామరాయుల సైన్యమునకుఁ దెలియదు. వా రన్నివైపుల చతురంగబలములతో యుద్ధసన్నద్ధులై యుండిరి.

అంతఁ గొంతవడి కుభయ సైన్యములకు సమరము ప్రారంభమయ్యెను. తురుష్కసైనికుల మధ్యభాగమున గల విలుకాండ్రు విజయనగరసైన్యములపై శరవృష్టి గురియించిరి. అందుల కలిగి విజయనగర వీరులు విలుకాండ్ర వధించు తలంపున నొక్కుమ్మడి ముందున కేగిరి. అంత నా ధానుష్కులు తప్పుకొనిరి. ఫిరంగులు భయంకరముగ రామరాయుల సైన్యములపై నగ్నివర్షములు గురియించెను. అట్టి హఠాత్సంఘటనకు హైందవ వీరులు కొంచెము వెనుకంజవేసిరి. కాని యుభయపార్శ్వముల విజయనగర యోధులు యవనుల వధింపుచు, నతి భయంకరులై తారసిల్లుచు ముందున కేగుచుండిరి. సేనామధ్యమునఁగల విపత్తును

గాంచి రామరాయలు తనసైన్యములఁ బ్రోత్సహించుచుఁ బరాక్రమము ప్రదర్శించిన యోధవరేణ్యులకు బంగారు నాణెములఁ బంచి యిచ్చుచుండెను. కాని ఫిరంగిదెబ్బలకుఁ దాళలేక నడిమి సైనికులు కొందఱు మరణించిరి. అట్టి పరిస్థితి నరసి యవనుల గుఱ్ఱపుదళమొకటి ముందునకు వచ్చుచుండెను. తిరుమలరాయ వెంకటాద్రిరాయ లిరువు రుభయపార్శ్వములనుండి చండశౌర్యమున యవనులఁ జెండాడుచు శత్రుసేనలలోఁ జొరబడుచుండిరి.

యుద్ధమధ్యమునఁ గల్గిన విషమస్థితి నరసి రామరాజు స్వయముగఁ దనసైనికులఁ బురికొల్పఁదలంచి మేనాయెక్కి వచ్చుచుండెను. కాని దురదృష్టవశమునఁ రణభూమినుండి యొక యేనుగుఁ బెదరివచ్చి రామరాయల మేనాపైఁబడెను. బోయీలు భయకంపితులై పాఱిపోయిరి. తోడనే రామరాయ లొక యశ్వముపై నెక్కఁబోవుచుండ దురుష్క సైనికులువచ్చి యాతనిఁ జెఱపట్టి కొనిపోయిరి. అప్పుడు నిజాంశాహ కఠినాత్ముఁడై కఱకుగరవాలమున రామరాయల కంఠ ముత్తరించి, యొక బల్లెమున గ్రుచ్చి యెత్తి విజయనగర వీరులకుఁ జూపెను. దండిమగంటిమి జూపి రెండువైపుల విజృంభించుచుండిన విజయనగర సైనికులు తమసేని మస్తకముగాంచి తత్తరపాటు జెంది పాఱిపోఁదొడంగిరి. యవనులు వారల వెనుదవిలి చాలమందిని సంహరించిరి. ఆ యుద్ధమునఁ దనయన్నతోఁ బాటు వెంకటాద్రియు వీరస్వర్గమందెను. తిరుమలరాయలు మాత్రము హతశేష సైనికులతో విజయనగరమున కేతెంచి సదాశివరాయలఁ గైకొని, బంగారము, రత్నములు మొదలుగాఁగల యపారసంపత్తి నైదువందల యేఁబది యేనుఁగులపై వైచుకొని పెనుగొండకుఁ బాఱిపోయెను.

రణరంగమునుండి దిరిగివచ్చిన సైనికులందఱును దమతమ కుటుంబములఁ గైకొని ధనధాన్యములతోఁ దరలిపోయిరి. విజయనగరము నిరాధారమయ్యెను. రెండువందల యేండ్లు పైనుండి శత్రువులకుఁ గన్నెత్తి చూచుటకైన వలనుపడని విజయనగరము నాఁడు నిరాధారమై చోరులపాలఁబడెను. కాలగర్భమునఁ గల మార్పులఁ గనుఁగొనలేముకద!

మఱునాఁడు తురకభటులు విజయనగరముఁ బ్రవేశించి ధన కనకములను తమ యిచ్చవచ్చినరీతిని దోఁచుకొనిరి. దిక్కులేని పౌరులనుబట్టి చిత్రవధలఁ గావించిరి. రాజసౌధములను, సుందరములగు కట్టడములను, రమణీయ శిల్పకళారాజితములైన దేవాలయములను, గోపురములను బడఁగొట్టి నేలమట్టముఁ గావించిరి. శిల్పకళాశోభితమై చెన్నుమీఱుచున్న విజయనగరమును శ్మశానవాటికఁ గావించి యవనసైనికులు వెడలిపోయిరి. ఆహా! రెండుశతాబ్దముల కెక్కుడుకాలమునుండి ప్రచండ తేజోరాశియై వెల్గొందుచుండిన విజయనగర మార్తాండుఁడు నాఁటితో నస్తంగతుఁడయ్యెను. తురుష్కభటులువిజయనగర విధ్వంసముగావించి కావించి, విసివి వేసారి విడిచిపోయిన శిథిల శిల్పమే నేఁడు హంపియందు మనకు లోచన గోచరమగుచున్నది. అట్టిదానియందు సైతముఁ గళా విలసనోజ్జ్వల ఘట్టములు నేఁడు పొడగట్టుచున్నవి.

విజయనగర వినాశనమునకుఁ గొన్నికారణములు కలవు. రామరాజత్యంత రాజ్యతంత్రవేత్తయైనను బెక్కు విజయముల వలన నలక్ష్యభావముననుండి, తురుష్కులను, వారి రాయబారు

లను నిరాదరణముగఁ జూచుచున్నందున వారలందఱేకమై కదన సన్నద్ధులగుటఁ గారణమయ్యెను. వారితో నొనరించిన కయ్యము లాదు వారి మతవిరుద్ధములగు కృత్యముల రామరాయల సైనికు లొనరించుటచేత, మహమ్మదీయులు కేవలము రాజ్యకాంక్ష తోడనే కాక మతమునందలి పట్టుదలవలనఁ దెగించిపోరి, విజయ ముఁగైకొనిరి. తాను వృద్ధుఁడయ్యు వెనుకనుండి సైన్యముల నడుపక రామరాజు రణరంగమధ్యమున కేగుట గొప్ప ముప్పు తెచ్చిపెట్టెను. ఉభయపార్శ్వములందును జయలక్ష్మి హిందువు లనే వరించియున్నను, మధ్యభాగమునకు రామరాయ లేగి ప్రాణ ములుగోల్పోవుటవలన నాయకుఁడు చచ్చెఁగదాయని సైనికులు చెల్లాచెదరైపోయిరి. తనకున్న సైన్యమంతయు తాళికోట రణాంగ ణమునకే తరలించుకొనిపోయెను. కాని రామరాయలు, నగర రక్షణకేమాత్రము సైన్యముంచకపోయెను. అట్లగుటవలన, విజయ నగరమునఁ దుష్కృతుల నడ్డగించువారులేమి, వారు నిరాఘాట ముగ నా మహాపట్టణమును భగ్నమొనరించిరి.

జీర్ణమైపోయిన విజయనగరప్రదేశ మిప్పుడు హంపీక్షేత్రమను పేర నొప్పుచున్నది. అయ్యది బళ్లారిజిల్లాలో హాస్పేట యను నయోమార్గస్థానమునకు సుమా రెనిమిదిమైళ్ళ దూరమునఁగలదు. నేఁడచ్చటి కేగిన ప్రతియాంధ్రుఁడును నాటి విజయనగర ప్రాభ వమునెంచి కంటఁ దడిపెట్టకమానఁడు.



## ౧౪

తాళికోట యుద్ధానంతరము తిరుమలరాయఁడు సదాశివరాయలఁ . గైకొని పెనుగొండకుఁబోయి, హతశేషులగు రాజబంధువులును, దండనాయకులును బరివేష్టించియుండ సదాశివరాయలఁ బట్టాభిషిక్తునిఁ గావించెను. సాటిలేని మేటి పరాక్రమవంతుఁడగు తన యన్నయు, వెంకటాద్రియు నా యుద్ధమున జనిపోయినందులకుఁ దిరుమలరాయఁడు మిక్కిలి చింతించెను. తరువాతఁ గొంతకాలమున కా దుఃఖమును బోఁగొట్టుకొని, నామమాత్రముగ సదాశివరాయల రాజుగనుంచి, తిరుమలరాయఁడు పెనుగొండలో రాజ్యముసేయ నారంభించెను.

పిమ్మటఁ గొలదికాలమునకు సదాశివరాయలు మృతినందెను. తిరుమలరాయఁడే యాతనిఁ జంపించి తాను రాజయ్యెనని కొంద అందురు. సదాశివరాయల మరణానంతరము తిరుమలరాయలు రాజయ్యెను. ఈతనికాలమున విజయనగర సామంతరాజులు స్వతంత్రింపఁ గొందఱిని తిరుమలరాయలే లోఁబఱచుకొనెనందురు. కాని యీతని యవసానకాలమునకుఁ జాలమంది సామంతరాజులు స్వతంత్రులైరి.

తిరుమలరాయఁడు కవితాపోషకుఁడు, ధర్మప్రభువు. ఈరాజు కడ సుప్రసిద్ధాంధ్రకవియగు భట్టుమూర్తి యుండి వసుచరిత్ర మీతని కంకితముఁ జేసెనట. తిరుమల దేవరాయలు శ్రీరంగము, కాంచీపురము మున్నగు క్షేత్రములందు దేవాలయములను, యాత్రికులు స్నానమొనరించు ఘట్టములను గట్టించెను.

తిరుమల దేవరాయలు గతించినపిదప నాతని రెండవ పుత్రుఁడగు శ్రీరంగదేవరాయలు కొంతకాలము పాలించెను. ఇతని తరువాత నీతని తమ్ముఁడగు వెంకటపతిరాయలు రాజ్యమునకు వచ్చెను. ఇతఁడు తనరాజధానిని పెనుగొండనుండి చంద్రగిరికి మార్చెను. పిమ్మట నీతనిసంతతివారు కొంతకాలము చంద్రగిరిని రాజధానిగఁ జేసికొని పాలించిరి. తుద కా సంతతిలోని వాఁడొకఁడు చంద్రగిరిని యాంగ్లేయులు కోట గట్టుకొనుటకుఁ గవులున కిచ్చెను. అదియే నేటి చెన్నపట్టణప్రదేశము.

దాదాపు రెండువందల సంవత్సరములపై కాల మవిచ్ఛిన్నముగ వెలుఁగొందిన విజయనగరసామ్రాజ్య మంతటితో నంతరించిపోయెను. ఆ తరువాత నాంధ్రులెప్పుడును రాజ్యముస్థాపించి యుండలేదు. విజయనగరరాజుల చరిత్రముఁ బ్రతియాంధ్రుఁడును బఠించి, వారి రాజ్యనిర్వహణనైపుణ్యమును, గవితాపోషణమును, గళాభివృద్ధియుఁగాంచి యానందించుటయే కాక యానాటి యాంధ్రవైభవము మరలవెలుఁగొందఁజేయ యత్నింపవలెను.

